# ఉపోద్ఘాతము



అలౌకికాద్భుత కథలన్నఁ జెవికోసికొను స్వభావము సామాన్యజనులలో నున్నది. అందుకుఁ దగినట్లు కట్టుకథలల్లి వినోదించు గుణము చతురుల మనుకొను కొందఱిలోనున్నది. ఈ రెంటి ఫలమే చిరకాలముగాఁ బ్రసిద్ధములైన నానావిధ గ్రంథముల నిర్మాణ విశేషము. అయితే పైఁ జెప్పఁబడిన ప్రజాసామాన్య గుణము నెఱింగిన తొంటి పెద్దలు భక్తి జ్ఞాన వైరాగ్యములవంటి మహాఫలములు సాధింపవేఁడి పురాణ రచనలు సాగించినారు. ఇతిహాసములు పుట్టి వేడబములు పచరించి చిత్తవినోదములు పొందినారు. ఇట్లనే హంస వింశతి శుకసప్తతి వంటి కట్టుకథలకు మూలములు.

అవి యంతటితో నాగి యుండినవి కావు. "స్వభావము దురతిక్రమము గదా!" ఏదో యొక విశేషమునఁ బ్రసిద్ధులైన యావలి యనేకుల మెడలకు నిట్టికథలు పుట్టి వాఁడుకలోనికి వచ్చినవి. ఆ తెగకుఁ జెందినవే యీ కవుల కథలు — "శక్తిః కవిత్వబీజంహి ప్రాక్తనీ కాపిసంస్క్రియా" అనియున్న యభిజ్ఞ వచనానుసారము కవుల మేధాశక్తి సామాన్యజనులకుఁ గొంత వింతగొలుపునదియే యగుట తథ్యము. అట్టి యాశక్తియే

బీజముగాఁ బుట్టిన గావ్యవిశేషముపై నేర్పడియున్న యితరుల సుక్కవనుబట్టియే కొందఱు చతురజనుల యీ కల్పనా చాతుర్యములకు లోకమున నొక స్థాయి యేర్పడినది.

కాళిదాస భవభూత్యాదులగు సంస్కృత కవులను, తన్నయతిక్కనాదులగు నాంధ్రకవులను బురస్కరించుకొని యనేకములగు కల్పనా కథలు లోకమున వాఁడుకలోనికి వచ్చియున్నవి. అట్టివే మన బమ్మెర పోతనామాత్యుని గూర్చిన చిత్రకథలును. అవి యీ చరిత్ర రచనా ప్రథానకాలమునఁ గూడ గ్రంథస్థములగుచుండుటయు, నది యా మహాకవి యందలి భక్తి సామాన్యమును బ్రజలలోఁ బెంపందించుచుండుటయు నొక విధముగా జూచిన మంచిదేయైనను వేఱొక విధముగా విచారించిచూచినఁ గ్రొత్తక్రొత్త పురాణ రచనల కింకను నాయువు మూఁడలేదను నమ్మకమును సైతము పుట్టించుచున్నది.

ఇట్టి యీ కథల విషయమునఁ బ్రసిద్ధులైన నేఁటి చరిత్రకారులలోఁ గొందఱు కూడ మనసుంచి తమ విమర్శనధోరణినే కొంత కుంఠితముచేసికొని బాధపడుచుండుట విచారకరము. వ్యతిరేక సాధనములు లేనిపట్టున నొకవేళ వారి యీ పద్ధతి కొంత యుపేక్ష్యమైనను ఉన్నపట్టునఁ గూడ నిట్టి తికమకలు గానవచ్చుట శోచనీయమనక తప్పదు. ఇది యిట్లుండ గొందఱు

చరిత్రకారులు "ప్రమాదోధీమతామపి" అను నభియుక్త వచన మును గూడఁ ద్రోసిరాజని తమ సిద్ధాంతమే సిద్ధాంతమను పూనికతో నొరుల నిర్లక్ష్యము చేయు టంతకంటెను శోచ నీయము.

నేను నా యీ బమ్మెర పోతన చరిత్రములో నిట్టి సిద్ధాంతముల నెన్నింటినేని త్రోసివేయవలసివచ్చినది. శ్రీనాథ పోతనల బాంధవ్య విచారము భాగవత శైథిల్యకారణ విచారము మొదలగు ననేక విషయములలో నా యీ మార్గము పెక్కండ్రకు రుచింపదని నే నెఱుఁగుదును.

అంతమాత్రమున వారికి నేను వినమ్రుడగా నవసరము లేదనుకొనియెదను. ఒకవేళ నా నిర్ణయమునకు వ్యతిరేక సాధనములు వారి కెవ్వియేని దొరకిన నవి గ్రాహ్యములని తలంపఁదగినంత బలవత్తరములై యుండునేని నా యభిప్రాయ మును నేను మార్చుకొందుననుట కెవ్వరును సంశయింప బని లేదు. అంతేకాదు నా యీ పొత్తముపై యోగ్యవిమర్శన ములు వెలువడి సత్యము బయటఁబడవలయునను గట్టి కోరిక తోడనే యీ నా ప్రయత్నమని సయితము పాఠకులగు విజ్ఞులకు నేను విన్నవించుకొనుచున్నాను.

నేనేదో హృదయవేగమున వ్రాసి నా సొంత పెట్టెలలో దాచుకొనియున్న యనేక సోదర గ్రంథములనుండి తద్విషయో

గమును సహింపజాలక మాటుమణిగియున్న ఈ చిన్న చరిత్ర గ్రంథమును వెలువరింపదలచి యందులకగు వ్యయప్రయాసల కోర్చి ముద్రణమునకు సహకార మిచ్చిన నా మిత్రులగు శ్రీ అనుగుల పాండురంగం శ్రేష్ఠిగారికిని శ్రీ మొసిశెట్టి వీరయ్య శ్రేష్ఠిగారికిని శ్రీ జిలిదె లచ్చయ్య శ్రేష్ఠిగారికి నా కృతజ్ఞతతో పాటు నా శుభాశీస్సుల నందించుచున్నాను. నా యీ కావ్యములో నత్యంత భక్తిశ్రద్ధలు చూపుచు ప్రయాసపడిన చిరంజీవి చిట్టిమల్లె శంకరయ్యకు నా శుభాశీస్సులను జెందించు చున్నాను.

ఇట్లు

బుధవిధేయుడు,

ప్రెస్టన్ ఇన్‌స్టిట్యూట్
జనగామ
28-11-1957.

అనుముల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి.

# బమ్మెర పోతన

## ఒకటవ ప్రకరణము



ఆంధ్రదేశమున మహాభారత రామాయణ భాగవతములకున్న ప్రఖ్యాతి మఱే గ్రంథములకును గలుగలేదు. ఇవి చిరకాలము నాఁడే యాంధ్రీకరింపఁబడి నేఁటివఱకును నాంధ్రుల సాదర పారాయణములకుఁ బాత్రములై యలరారుచున్నవి. అందును భక్తిరస ప్రధానమైన భాగవతము పండిత పామర సాధారణముగాఁ దెలుఁగు నాఁటఁ బ్రతియింటను వెలయుచు నెల్లవారిచే సంభావింపఁబడుచున్నది. పూర్వలాక్షణికులు దీని యందెవ్వియేని లక్షణవిరుద్ధములైన ప్రయోగములున్నవని తాముచూపెడు లక్ష్యస్థానమున దీనినుండి యెట్టి యుదాహరణములును గైకొన్నవారుకారు. అయినను వారు భాగవతమును దత్కవిని గౌరవించుటలో నభ్యంతరపడినవారు మాత్రము కారు. రేఫ అకారముల మైత్రియును దోసముదక్కఁ బోతన కవిత్వములో నేమి దోసమున్న? దని అప్పకవి చెప్పుచుఁ దన్నిర్దోషత్వ సామాన్యమును గౌరవించుచున్నాఁడు. ఆ దోషముసైతే బిరావలి వారి పూరణములందే కాని పోతన కవిత్వమునందు లేదని కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహమున నొక్కి చెప్పి పోతన్నను బహుధా పూజించుచున్నాఁడు.

ఇట్లు బహు విధములఁ బూజింపఁ బడుచున్న పోతనామాత్యుని దేశకాలాదుల నిర్ణయము మాత్రము పెక్కండ్రు పెక్కు విధముల లాగి లాగి యేదియు నిశ్చితముగాకుండ జిజ్ఞాసు లోకమును దికమకలు పట్టించుచున్నారు. మహాకవు లే దేశమునం దేకోణమున జన్మించినను వారియెడఁ జూపవలసిన గౌరవాదరముల కెప్పుడును గొదువ యుండదు కనుక నీ విషయమున నంత వివాద మక్కఱ లేదనుట సత్యమే. కాని సత్యాన్వేషణపరుల కంత మాత్రపు సమాధాన మొక చక్కని సమాధానము కాదుగదా!

ప్రకృత మీ సత్యసమీక్షణ బుద్ధితోనే నేనీ చిన్ని పొత్తమును వ్రాసి ప్రకటింపఁదలఁచినాను. ఇందుఁ బోతన జన్మస్థానమును గూర్చియు, నాతని కాలమును గూర్చియుఁ జర్చించి – తరువాత నాతని విద్యాభ్యాసాదులను గూర్చి వివరించుట యుక్తమనుకొనుచున్నాను.

(౧) పోతన నివాసస్థాన నిర్ణయము.

(౨) ,, (అతడు) జీవించియున్నకాలము.

(౩) పోతన వంశము – బాల్యము తద్బంధువర్గము విద్యాభ్యాసాదికము.

(౪) భాగవత రచన, అప్పటి స్థితిగతులు.

అను నీ నాలుగు విషయముల నాలుగు ప్రకరణములుగా విభజించి నా యీ రచనను గొనసాగింతును.—

ఇందుకుఁ బ్రమాణభూతములుగా నా గ్రహించునవి చాల వఱకును పోతనామాత్యుని గ్రంథములే. అవి (౧) వీరభద్ర విజయము (౨) భోగినీ దండకము (3) భాగవతము – వీని రచన సైతము క్రమ పరిప్రాప్తమయినదే. ఎట్టులన వీరభద్ర విజయమును దాను బాల్యముననే రచించినట్లు పోతన యీ గ్రంథ పీఠికలోనే తన గురువు తననుగూర్చి పలికిన ప్రోత్సాహ వాక్యముగా——

గీ॥ పిన్నవాఁడ ననియుఁ బెక్కు సత్కృతులను
వినని వాఁడననియు వెఱపుమాను
మత్ప్రసాద దివ్యమహిమచే నెంతైన
కవిత చెప్పలావు గలదు నీకు ॥

అను పద్యమును రచించి యున్నాఁడు. దీనివలన వీరభద్రవిజయ రచనాకాలమునకుఁ బోతన చాలఁ బిన్న వయసు వాఁడని తెలుచున్నది. ఇంతేకాక పోతన తన యక్షరాభ్యాసాది ప్రథమ శిక్షణము తండ్రికడనే జరిగినట్లు సైతము "జనక శిక్షితాక్ష రాభ్యాసుండనై" అను వాక్యముచేఁ దెలుపుకొని యున్నాడు. ఆ తండ్రి తన యీ వీరభద్ర విజయ రచనాకాలమునకు జీవించియున్నట్లు కూడ నాతని దీర్ఘాయుష్యమునుగోరి "కేసనమంత్రి, సత్యనిధిఁ గీర్తి విశాలు, జిరాయురున్నతుం జేసి యుమామహేశ్వరులు చెన్నుగఁ గాతురుగాక సత్కృపన్" అని పోతన యుమామహేశ్వరులఁ బ్రార్థించిన పద్యమువలనఁ దెలియుచున్నది.

ఈవలి లేఖకు లెవ్వఁడో వీరభద్రవిజయమున "పోతన తన భాగవతమునందలి దక్షాధ్వరధ్వంసన కథలో శివమహిమాభివర్ణనము నల్పీకరించినందున దానికి తృప్తి జెంది యీ వీరభద్రవిజయమును వ్రాసె"నను నర్థముగల యొక పద్యమును జొప్పించినందున సాధారణ జనులిది యట్లే యుండునని తలంచుచుండిరి. కాని యీవల శ్రీ కందుకూరు వీరేశలింగము పంతులుగారును తెలంగాణాలో నివసించుచుఁ దమ చారిత్రక శోధనలచే నాంధ్రులకు మహోపకారము గావించిన శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యులుగారును నీ పద్యముయొక్క రచనా విశేషమును దాని యనుపపత్తిని గూర్చి స్పష్టముగాఁ బ్రకటించియున్నారు. నే నుదాహరించిన పోతనయొక్క సొంత వాక్యములుగూడ నీ విషయమును నిరాకరించుచు నేయున్నవి. వీరభద్రవిజయ భాగవతములకు శైలీ భేదమున్నదను వారి వాదముసైతము నిరాలంబమైనదే. అది శైలీ భేదముగాక కవియొక్క వయోభేదమును దదనురూపమైన యతని సంస్కార భేదమును దెలుపు విశేషము మాత్రమే యయి యున్నది.

భోగినీ దండకము పోతన రచనయె కాఁజాలదను నొక వాదముగలదు. అదియు నిరర్థకవాదమె. ఏలయన మానవ జీవితములో నెన్నియేని పరిణామములు గలుగుచుండుట సర్వజన విదితము. ఒకప్పుఁడు ధన తృష్ణా తరళితచిత్తుఁడైన వాఁడే యొకప్పుడు పరమ వైరాగ్య సంపన్నుఁడు గావచ్చును. ఒకప్పుడింద్రియ చిత్తచాపలమున నకార్యములు గావించినవాఁడే వేఱొక

ప్పుడు తన పనిని దానే గర్హించి సుచరిత్ర పరాయణుఁడు గావచ్చును. ఇట్టి వనేకుల కనుభవ సిద్ధములు.

భోగినీ దండకము చివరనున్న పద్య మొకవేళఁ బ్రక్షిప్త మని తోసివేయఁ జూచినను నా దండకము శైలియొక్కటియే కాక రచనా పద్ధతి యంతయును భాగవత రచనా పద్ధతి కత్యంత సన్నిహితమైయున్నది. ఈ విషయమునుగూడ శ్రీ పంతులుగారును శ్రీమాన్ ఆచార్యులుగారును విచ్చి చెప్పి యున్నారు. ప్రౌఢిమనుబట్టి యీ దండకము వీరభద్రవిజయము పిమ్మట నుత్పన్నమైనదిగను, భాగవతమునందలి రాజాశ్రయ గర్హణమునుబట్టి భాగవతమునకంటెఁ బూర్వముదయించినది గను ఖండితముగాఁ జెప్పవచ్చును.

నా చెప్పిన యీ క్రమము ననుసరించి పోతన యీ మూఁడు కావ్యములను దన ౨౦ వ సంవత్సరము మొదలు ౬౦ వ సంవత్సరము వఱకును గల వయస్సులో నెప్పుడో రచించినవాఁడని విశ్వసింపఁదగును. పోతన దేశకాలాదులు మన మీ మూఁడు కృతుల మూలమున నెంత గ్రహింపఁ గలమో అంతకుమించి యేమి నిర్ణయింపఁ బూనినను నది నిర్హేతుకవాదమగును—కనుక మన యీ నిర్ణయానుసారముగాఁ దొలుదొల్తఁ బోతన జన్మస్థానమును గూర్చి చర్చింతము.

మన యిప్పటి యింటి పేర్లు సాధారణముగా నొకా నొకప్పటి మన పూర్వపురుషుల (కూటస్థుల) వ్యావహారి నామములో వారి వృత్తినామములో అని భావింపవలసినవిగాఁ

గొన్ని యున్నవి. కాని యనేకములు వారి పూర్వ నివాస గ్రామ నామములే యైయున్నవి. అట్టివి తోటపల్లి, మరుమాముల, అనుముల, భువనగిరి మొదలగునవి— పోతన తన వీరభద్రవిజయములో స్వనామమునకు ముం దేయుప నామమును జేర్చుకొనలేదు. కాని తన రెండవ కృతియగు భోగినీదండకము చివరి పద్యమును "పండిత కీర్తనీయుఁ డగు బమ్మెర పోతన" అను వాక్యముతోడనే యారంభించినాఁడు. భాగవతమునందు "శ్రీహరి కిచ్చి చెప్పె నీ బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్" అని తన ప్రత్యేకతను బ్రకటించునెడ నీ బమ్మెర నుపపదముగా వాడుకొన్నాఁడు. ఇంతేకాక తన తల్లినిగూర్చి చెప్పుకొన్న పద్యములోఁ దన తండ్రి నామమునకు ముందుఁగూడ నీ బమ్మెర పదమును బ్రయోగించినాఁడు "మానినులీడుగారు" అని యారభింపఁబడిన యా పద్యములో "బమ్మెర కేసయ లక్కసానికిన్" అని యా ప్రయోగము.

ఇప్పుడు మనము పోతన నామధేయమున కుపపదముగా నాతఁడు వాడుకొన్న బమ్మెర పదమునుగూర్చి చర్చింపవలసి యున్నది. బమ్మెర యనునది వృత్తి నామముగాని, కు[illegible] పురుషనామముగాని కాదనుట నిర్వివాదాంశము. ఇఁక నది గ్రామ నామ[illegible]గునేమో విచారింపవలయును.

పోతన నేటి యాంధ్రప్రదేశములోని రాయలసీమ [illegible]నొక్కటియైన కడప జిల్లాలోని యొక గ్రామమునఁ

బుట్టి యుండుననియు నతఁ డామండలమునందున్న యొంటిమిట్ట గ్రామనిలయుఁ డగు (శ్రీ) రామచంద్రునకు భక్తుఁడై తత్సన్నిధి యందుండి తదంకితముగా భాగవత రచన సాగించినాఁడనియుఁ గొందఱి వాదము. అందుకు వారు చెప్పు కారణ మేమనఁగా భాగవత పీఠికలోఁ బోతన తా నొక సోమోపరాగ కాలమున గంగకుం జని క్రుంకు లిడి దైవ ధ్యానము చేయుచుండ శ్రీ రాముఁడు కాన్పించి తనకు గృతి యీ వేఁడఁగా నందుకు సమ్మతించి తిరిగివచ్చుచు మార్గమధ్యమున నున్న యేకశిలా నగరమునకుఁ జని యచ్చటి తన గురు వృద్ధ బుధబంధుజనుల యనుజ్ఞఁబొంది గ్రంథ రచన కుపక్రమించినట్లు చెప్పిన వాక్యము, దానినిబట్టి పోతన యేకశిలా నగరవాసియో తత్ప్రాంత నివాసియో యగునని తేలుచున్నదిగదా! ఏకశిలానగర మన ఒంటి మిట్ట యని కాక వేఱొక యర్థము చేయవలనుపడదు గనుక బమ్మెర యనునదియు నా ప్రాంత గ్రామమే కావచ్చును. లేదా బమ్మెర యెచ్చటనున్నను నది పోతన పూర్వుల నివాస మగునేమోకాని యాతని నివాసము మాత్రము కాదు. అతని గురు వృద్ధ బుధ బంధుజనులున్నది యేకశిలానగరమే అనఁగా ఒంటిమెట్ట గ్రామమే కావున నతని నివాస మదియో తత్ప్రాంత గ్రామమో కాక తప్పదు – అనునది.——

ఇట్టియెడ ఒంటిమెట్ట గ్రామమున కేకశిలానగర మను పేరున్నదా? దాని కిట్టి పూర్వప్రయోగము లెందైనఁ గాన్పించినవా? లేక ఒంటిమెట్ట యనుటకు నేకశిలానగర మను నది పర్యాయ పదమాత్రమా? అను ప్రశ్నములకు సమాధాన

ములు. రాఁదగి యున్నవి. అయ్యలరాజు రామభద్ర కవి నేఁటికి 400 సంవత్సరముల నాఁడుండి యొంటిమెట్ట శ్రీరాముని పేర నొక శతకము వ్రాసియున్నట్లు రామాభ్యుదయ మను నాతని గ్రంథపీఠికాదులవలనను తుది గద్యమువలనను దెలియు చున్నది. కాని యా గద్యమున – "ఒంటిమెట్ట రఘువీరశతక నిర్మాణ కర్మఠ" అని తన్నుఁ గూర్చి యాతఁడు విశేషించి కొన్నందున అప్పటి కొంటిమెట్ట కేకశిలానగరమను పర్యాయపదము వాఁడుకలోనుండ లేదని స్పష్టపడుచున్నది. వాదులు శాసనాద్యాధారములను వేనినిగూడ నీ విషయమునఁ జూపుచుండుట లేదు. ఒంటిమెట్ట యను మాట కేకశిలానగర మనునది పర్యాయ పదము కాఁ గలదా?

ఒంటి అనుదాని కేకపద మొక వేళఁ బర్యాయము గాఁ దలంత మన్నను "మెట్టపదమునకు శిలాపదము పర్యాయ మనుటకు వీలు లేదే. మెట్టయనగా ఘట్టమని యర్థము వచ్చును. మంకరిమెట్ట, బండ్లమెట్ట మొదలగునవి దీని కుదాహరణ ములు. ఒక వేళ మెట్టగాదు మిట్ట యనుకొందమన్నను నదియైన శిలారకముగాక యొక యెత్తుప్రదేశమును నర్థమిచ్చునంత మాత్రములో నిదే యగుచున్నది.

కావున నీ వాద మెవ్వరెట్లు తెచ్చిపెట్టినను నంగత మగాఁ గాన్పింపదు – అయినను దీని మూలమును దత్పరిణా[illegible] [illegible] వరించవలసియున్నది.

భాగవతము మొట్టమొదట ముద్రించునప్పుడు ముద్రాపకు లొక్క పీఠిక వ్రాయించినారు. ఆ పీఠికాకారుఁడు పోతన వెంకటగిరి సంస్థానము వారి పూర్వుఁడైన సింగమనాయని పేరఁ భోగినీ దండకమును రచించినాఁడని విని వెంకటగిరి వారి పూర్వుఁడు వెంకటగిరియందుండి రాజ్యము చేసినవాఁడే కదా అను భ్రాంతిలోఁబడి యా వెంకటగిరికి సమీపమునందే తదాస్థాన కవియొక్క వృద్ధ బుధ బంధు జను లుండఁ దగు నను నూహతో - వెదకి వెదకి తుదకీ యొంటిమెట్టను బట్టుకొన్నాడు. దానినే పోతన - యేకశిలానగరమని తన భాగవతములోఁ జెప్పుకొని యుండునని సుస్థిరపఱచి పీఠికను బూరించినాఁడు. ఈ నిరాలంబవాదమును బెద్దచేసి కీ. శే. వావిలికొలను సుబ్బారావుగారును వారి ననుసరించు కొందఱు కడప జిల్లా పండితులును (నీవల నీ వాదము చరిత్ర కుశలులచే బహుధా నిరసింపఁబడినను) విడువక ప్రాకులాడుచున్నారు.

ఇప్పుడు, మన మా భోగినీ దండక కృతిపతియుఁ గథానాయకుఁడునైన సింగభూపాలుని వంశమును నాతని నివాసమును సరిగా నిర్ణయింపఁ గలిగితిమేని దాని మూలమున వచ్చిన యీ యొంటిమెట్ట వాదమునైతము విఱిసిపోఁగలదు. ఈవల వేంకటగిరి సంస్థానాధిపతులును వారి జ్ఞాతులగు జటప్రోలు (తెలంగాణాలోని మహబూబు నగర్ జిల్లా) సంస్థానాధిపతులును వెలుగోఁటివారి వంశ చరిత్రము సూరభివారి వంశ చరిత్రమునను పేళ్ళ రెండు గ్రంథములను వ్రాయించినారు. అవి తత్తత్పూర్వాధారములనుబట్టి వ్రాయఁబడినవట. [illegible]

వంశవృక్షమును భోగినీ దండక కృతిపతి యగుటను మన కవసరమైనంత యీ క్రిందఁ జూపెదను.

బేతాళనాయఁడు మొదలుగల

౧. చెవ్విరెడ్డి

(౨) దామా నా. — ప్రసాదిత్య నా. — రుద్రమ నా.

(౩) వెన్నమ నా. — సబ్బి నా.

(౪) ఎఱదాచా నా.

(౫) I సింగమ నాయఁడు — వెన్నమ నాయఁడు — యాచమ నా.

(౬) I అనపోతా నాయఁడు — మాదా నాయఁడు — నాగా నాయఁడు

(౭) వేదాద్రి నాయఁడు — II సింగమ నాయఁడు. — చిన వేదాద్రి నా.

రామచంద్ర నా. — కుమార-మాదా. నా.

కు. వేదగిరి – లింగమ నా.

గమనిక :– ఆఱవ తరము అనపోతా నాయని కిద్దరు కుమారులని–తత్పుత్రుఁడగు II. సింగభూపాలుఁడు, సింగభూపాలీయ మను నామాంతరముగల తన రసార్ణవ సుధాకరములో.

౧ శ్లో॥ తయోరభూతాం పుత్రౌ ద్వావాద్యో వేదగిరీశ్వరః
ద్వితీయస్తస్య ద్వితీయోఽసౌ యశసా సింగభూపతిః.

౨ శ్లో॥ అథ శ్రీ సింగభూపాలో దీర్ఘా యుర్వసుధా మిమాం
నిజాం శక్తేశ నిర్వ్యాజం కురుతే సుప్రతిష్ఠితాం.

అను శ్లోకములందు సవిశేషముగాఁ జెప్పియున్నాఁడు. ఐతే యిందుఁ జూపఁబడిన రెండు శ్లోకములలో మొదటి శ్లోకము యొక్క యుత్తరార్థము లేఖక దోషమునఁ గాఁబోలు, "యశసా శివభూపతిః" అని పడినది. దీనిని విమర్శించికొనక పైఁ జెప్పఁబడిన చరిత్ర రచయితలు ౨ వ శ్లోకములో స్పష్టముగానున్న సింగభూపాలుఁ డెవ్వఁడా యని తర్కించి తుదకు, మొదటి శ్లోకముయొక్క పూర్వార్థమునఁ జెప్పఁబడిన వేదగిరినాయుఁడే. అనఁగా అనపోతానాయని పెద్ద కుమారుఁడే (వేదగిరి దేవుఁడు నృసింహుఁడు గావున) సింగభూపాలుఁ డని యన్వయించుకొన్నారు. మనుష్యనామములకుఁ బర్యాయపదములు వాడుట సంప్రదాయ విరుద్ధముగదా!

ఈ తప్పు మొత్తము గ్రంథములోని యనేకాంశములను తాఱుమాఱుచేసినది. ఆ గ్రంథకర్తలకు శివభూపతి మఱి యెచ్చటను దొరకనే లేదు -. కావున ౬ వ తరము అనపోతానాయని యీ రెండవ కుమారుఁడు. (శివభూపతియని తమచేఁ బేర్కొనఁబడినవాఁడు) తరువాత చరిత్రమునఁ గానవచ్చు ధర్మానాయుఁడని రెండు యపార్థము చేసినారు. రసార్ణవ సుధాకరమున సింగభూపతి తన కుమారుల పేళ్ళు.

శ్లో॥ మందార పారిజాతక సంతానక కల్ప కుసుమణీ సదృశైః
(1) (2) (3) (4) (5) (6)
అనపోత దాచ వల్లభ వేదగిరిస్వామి దామ [illegible]దాభిఖ్యైః

౨. శ్లో॥ అత్మభవైరతి విభవై రనితర జనసులభ వి[illegible]మైః [illegible]
రత్నాకర ఇవ రాజతి రాజకరారూఢ రచిత కమలోల్లాసః.

అను శ్లోకములలో స్పష్టముగాఁ జెప్పుకొన్నాఁడు. ఇందులో లేని — చినసింగమనాయఁ డనువాని నొకని సృష్టించి వాఁడు వేదగిరిస్వామియే కాఁదగునని మఱియొక యసంగతార్థమును లాగినారు. నిజములోఁ బూర్వచరిత్రములలోఁ గానవచ్చు ధర్మానాయఁడు రసార్ణవసుధాకర కర్తయొక్క ౫ వ కుమారుడగు దామానాయఁడే కావలె. మాధవనాయని-మాదానాయఁ డన్నట్లు ధర్మానాయని దామానాయ డనుట పూర్వులకు సహజము.

ఇట్టివే కేశవునిఁ గేసన్నయనుట. త్రిపురారిని తిప్పన్న యనుట. గణపతిని గన్నప్ప యనుట మొదలగునవి — ఇకఁ భోగినీ దండక కృతిపతియగు సింగభూపాలు నీ కల్పిత సింగభూపాలునికిఁ బౌత్రుఁడని యన్వయించినా రా గ్రంథకర్తలు. రసార్ణవ సుధాకర కర్తయగు ౭ వ తరము సింగభూపతి [illegible] చిన్న సింగభూపతి గావలె. [illegible] సింగభూపతి పెద్ద సింగ[illegible] గావ [illegible] చిన్న [illegible] భూపతి కాఁదగును. [illegible]
[illegible] జెన్నయను [illegible]
వి [illegible] [illegible]

ఇట్టివే కుమారమాదు, (మాదానాయని మనుమఁడు) కుమారవేదగిరి. (వేదగిరినాయని మనుమఁడు) ఇత్యాదులు. కనుక – ౬ వ తరమునుండి యీ వంశ మీ క్రింది విధముగా వ్రాయఁదగినది.

౬ వ తరము

అనపోతానాయఁడు

(౭) వేదగిరినాయఁడు సింగమనాయఁడు (రసార్ణవసుధాకరకర్త)

(౮) (కుమార) అనపోత – దాచ – వల్లభ –

వేదగిరిస్వామి దామ – మాదా నా.

(౯) (కుమార) సింగమనాయఁడు.

(భోగినీ దండక కృతిపతి)

రసార్ణవసుధాకర గ్రంథకర్త అనపోతానాయని కుమారులలో ద్వితీయుఁడైన సింగభూపతి–ఇతనిని భోగినీదండకములోఁ దన కృతినాయకుని పితామహుఁడుగా "రావు సింగక్షమానాథ పౌత్రుఁ" అని పోతన వర్ణించినాఁడు దాని తరువాతి వాక్యములు వరుసగా "సమీచీన రేచర్ల గోత్రాంబుజాతాత్మ మిత్రుఁ మహోదార చారిత్రు సర్వజ్ఞ సింగోర్వరానాథు నీక్షించి" అనునది. ఇందుమూలమునఁ బితామహునకు రావుసింగ భూపాలుఁడనియు మనుమనికి సర్వజ్ఞ సింగభూపాలుఁడనియు

బిరుదములున్నట్లు తెలుచున్నది. కావున శ్రీనాథకవి వర్ణించిన (రావు సింగమహీపాలు ఢీవిశాలు) రావుసింగమహీపాలుఁడు ౭ వ తరము (రసార్ణవ సుధాకర కర్త) సింగభూపాలుఁడై యుండును. తత్పౌత్రుఁడగు నీ సర్వజ్ఞ బిరుదాంచిత సింగభూపాలుఁడు పోతనచేఁ గృతిఁ బొందిన భోగినీ ప్రియుఁడు గావలెను. కాఁబట్టి వెలుగోటివారి, సురభివారి వంశచరిత్రములందుఁ జెప్పఁబడినట్లు భోగినీ దండక కృతిపతి ౧౦ వ తరము వాఁడు గాక ౯ వ తరము వాఁడే యగుచున్నాఁడు. ఇతని పితామహుఁడు తన రసార్ణవ సుధాకర పీఠికలోఁ దన్నుఁ గూర్చి

శ్లో॥ రాజా స రాజాచల నామధేయా
మధ్యాస్త వంశక్రమ రాజధానీం.

అని చెప్పుకొని యున్నందున నతని రాజధాని రాజాచల మని సంస్కృతీకరింపఁబడిన రాచకొండ యని స్పష్టపడుచున్నది. ఇది వంశక్రమ రాజధాని యట. ఇతని తండ్రి యయిన ౬ వ తరము అనపోతానాయఁడు తన శాసనము లందు తాను రాజగిరి నివాసుఁడనని చెప్పుకొనుటయే కాక యీ రాజధానిని రాచకొండ యనియు (రాచకొండ మీఁది కలుకోటలు, బావులు, అని) శా. శ. ౧[illegible]౭ నాఁటి శాసనములోఁ జేర్చుకొన్నాఁడు. రాజుకొండ యని సైతము కొన్ని శాసనము లందున్నది.

ఈ రాచకొండ నలఁగొండ మండలమునందలి [illegible]రా[illegible]మాపురమునకుఁ బడమట ౬ మైళ్ళ దూరమునను, [illegible]రా

పోదుకుఁ బూర్వున 3_౽ మైళ్ళ దూరమునను, భువనగిరి రైలు స్టేషనుకు (సికింద్రాబాద్ ఖాజీపేట లైను) దక్షిణము 3౦ మైళ్ళ దూరముననను, దేవరకొండకు (నల్లగొండ జిల్లా) వాయవ్యమున 3౦ మైళ్ళ దూరముననను గలదని పూర్వకాలీన చరిత్రకారులే వ్రాసియున్నారు. ప్రకృతము నేనున్న జనగామకు భువనగిరి స్టేషన్ నైఋతి దిక్కున నిరువదియైదు మైళ్ళ దూరములో నున్నది. సికింద్రాబాదు ఖాజీపేట జంక్షనులకు నడుమ నడచు రైలుమార్గమున భువనగిరి, జనగామలు రైలు స్టేషనులై యున్నవి.

వరంగల్లుజిల్లాలో నొక తాలూకాకు హెడ్ క్వార్టరుగా నున్న జనగామకు రాచకొండ పూర్తి ఆగ్నేయమున రమారమి ౫౦ మైళ్ళలో నుండవచ్చును. బమ్మెర యీ జనగామ తాలూకాలోనిదే.

రావుసింగభూపాలుని కాలమున వీరికి రాజధానిగా నున్న రాచకొండయే యితని మనుమఁడగు సర్వజ్ఞసింగ భూపతికిని రాజధానియై యుండు ననుటకు సందియము లేదు. ఈ రాచకొండ కీశాన్యమున రమారమి ౬౦ మైళ్ళ దూరములో బమ్మెర గ్రామ మున్నది. ఈ బమ్మెర కుత్తరమున 3౦ మైళ్ళకుఁ దక్కువ దూరములోఁ గాకతీయ రాజధానియగు నేకశిలా నగరము (పూర్వ మోరుగల్లు. ఇప్పుడు వరంగల్లు) గలదు. ఓరుగల్లున కేకశిలానగర మను పేరు బహు గ్రంథ సిద్ధము.

ఉదాహరణములు:—

(౧) ప్రతాపరుద్రీయము – నాటక ప్రకరణము.

సూత్రధార వాక్యము. (సవినయ ముపసృత్య సభాభి ముఖమంజలింబధ్వా) "భోభో మధ్యమ భువన భాగధేయ నివర్తస్య ఏకశిలానగర పుణ్యారాశేః కాకతీయ కుల దేవ తాయాః స్వయంభూ దేవస్య—"

ప్రతాపరుద్రీయము – పంచమాంకము.

పురోధసః:— (సోల్లాసం) "రాజ న్నేకశిలానగరవాసినో మహాద్విజా స్త ఏతే"

"రాజన్నేకశిలానగరీ వల్లభ"

ఈ ప్రయోగములు నాటక ప్రకణములో దత్తపాత్రల ముఖమునఁ బ్రతాపరుద్రుని గూర్చి విద్యానాథకవి వాఁడినవి. వీనికాలము క్రీ. శ. ౧౩౨౦ కిఁ బూర్వము.

(౨) క్రీడాభిరామము – వల్లభామాత్యుఁడు – లేక శ్రీనాథకవి.

ఆకర్ణించి సూత్రధారుఁడు "హా! యేనెఱింగితి నేకశిలా నగరంబునఁ ద్వారవాటంబునం గామమంజరి యను పుష్పలావి నందు బద్ధానురాగుండై"

టిట్టిభసెట్టి వాక్యము.

ఉ॥ మంచన వింటివో వినవొ మన్మథుఁ డేకశిలాపురంబులోఁ
జంచల నేత్రలం బతుల శయ్యలపై . . ఇత్యాది.—


బమ్మెర పరము
జనగాం
20మైళ్లు బమ్మెర
భువనగిరి
30మైళ్లు
రాచకొండ
నారాయణపురం
30మైళ్లు దేవరకొండ

ఈ క్రీడాభిరామ కథానాయకుని ప్రసంగములోనే పై నుడివఁబడిన యేకశిలానగరమున కోరుఁగల్లు నామముసైతము పెక్కెడల వాడఁబడినది.

"ఓరుఁగంటి పురంబులో నోరగంతఁ
బెద్ద యెలుఁగున నమ్మె సంపెంగ నూనె"

"ఓరుఁగంటి పురంబు సౌధములపై నొప్పారెడిం జూచితే" ప్రతాపరుద్రీయ క్రీడాభిరామములు పోతనకుఁ బూర్వము పుట్టిన కృతులు. పోతన కించుక యీవలివాఁడని చెప్పఁదగిన కొఱవిగోపరాజు తన సింహాసన ద్వాత్రింశికలో నోరుగల్లు కెట్లు లేకశిలానగర మనుపేరు వచ్చెనో యొక ప్రకరణమున నీ క్రింది పద్యములోఁ జెప్పుచున్నాఁడు – చూడుఁడు!

ఉ॥ ఆకడ నీతిశాస్త్ర విదుఁడై గురు వీడ్కొని యేగ వేడ్కతోఁ
గాకిత మూలశక్తి గనిగా నొనరించిన పైఁడి చట్టునా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కు ధరిత్రిలోన నే
పోకలఁ బోని యట్టి సిరి పుట్టిన యింటికి నోరుగంటికిన్.

ఇంతకంటె నేకశిలానగర మన్న నోరుఁగల్లనుటకు వేఱొక సాధనము గావలయునా?

పోతన చంద్రగ్రహణకాలమున స్నానార్థముపోయినది నేఁటి వరంగలుజిల్లా కుత్తరపూర్వసీమం బాఱు గోదావరీ నదికిఁగాని కాశీగంగకుఁ గాదు – గోదావరిని 'గంగ' యనుట యిచ్చటఁ బండిత పామర సాధారణ విషయము.

ఇందుకు శ్రీనాథ మహాకవి ప్రయోగములు.

"కణకఁ గాంతేయమున వృద్ధగంగఁ గ్రుంకి"

కా.ఖం. తృ. ౧౬ ప.

"పాత శ్రీశైలంబు పాదమూలంబునఁ గల్లేటితో
వృద్ధ గంగవారి" కా. ఖం. – తృ – ౨౭ పద్యము.

"గౌతమీ గంగ ముత్యాల కంఠమాల" కా. ఖం. తృ
3౧ పద్యము.

ఇంతయేల పోతన్నయే భాగవత దశమస్కంధమునందు శ్రీకృష్ణుఁడు గోవులను నదీనామములఁ బిలిచినట్లు వర్ణించు పద్యమున. "రాపూర్ణచంద్రికా! రాగౌతమీ గంగ రమ్మ భగీరథరాజతనయ" అని పలుకుచున్నాఁడు. గౌతమీగంగ యని యిందు గోదావరినే కదా పోతన సూచించినది.

శ్రీనాథకవి గోదావరిని నిరుపపదముగా 'గంగ' యని పిలిచిన ఘట్టములును గలవు.

"ప్రవహించునే పేటఁ బశ్చిమ ప్రాకార
మొరసి గంగమ్మ సాగరము తొమ్మ।

వెనుకఁ బోతన్న కించుక యీవలివాఁడుగా నేను వ్రాసి యున్న శ్రీ ఆవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశికలోనై తను గోదావరిని వర్ణించుచు

క॥ అతఁడు త్ర్యంబక శిఖరో
ద్భూతను విఖ్యాతఁ బరమ పూతఁ ద్రిలోకీ
మాత మహాపాతక సం
ఘాత విఘాతాను యాతఁ గనియెంగంగన్

మఱియు నితఁ డా గ్రంథమునందే ధర్మపురి వర్ణన సందర్భమున "అటఁజని గంగలో జలక మాఁడి" "శాశ్వతమహా కృపారసము చాడ్పున ముందఱ గంగ పాఱఁగా" అని వర్ణించి యున్నాఁడు.

ఈ యన్నింటిని జూచిన పిమ్మటఁ బోతన తన బంధు నివాసముగాఁ జెప్పిన యేకశిలానగర మోరుగల్లు (నేఁటి వరంగల్లు) కాదని కాని, యాతఁడు గ్రహణస్నానార్థమేగిన గంగ గోదావరి కాదని కాని చెప్పసాహసించు వా రుండరనియే నేను దలంచుచున్నాను.——

పోతన నామమున కుపపదముగా స్వవచనము చేతనైన నేమి, తదితర కవుల వర్ణనముల చేతనైన నేమి, జనులవాఁడుకను బట్టియైన నేమి స్థిరముగా నిలిచిన బమ్మెర వద మాతని కింటి పేరుగాదు– మఱి యేమన్న నది యాతని నివాసగ్రామ నామమే. ఈ గ్రామము జనగాం తాలూకాలో జనగాం గ్రామమున కించుక యుత్తరము మిగిలిన తూర్పుదిశలో రమారమి ౨౦ మైళ్ళ దూరమునందున్నది. దీని నిప్పటికిని బమ్మెర యనియే యందురు. ఇది తత్పూర్వముగూడఁ బ్రసిద్ధమైన గ్రామమే. ఈ గ్రామము భోగినీ దండక కృతిపతియగు సర్వజ్ఞ

సింగభూపాలుని రాజధాని యగు రాచకొండకును నేకశిలా నగర మనఁబడు వరంగల్లుకును నడుమ మార్గముఁలోనే యున్నది. ఈ బమ్మెరనుండి గోదావరీ నదికి రాకపోకలు చేయవలెనన్న నోరుఁగల్లు మీాఁదుగనే ప్రయాణము చేయనలసి యుండును.

బమ్మెర గ్రామము చాళుక్య విక్రమ సం. ౪౭ కు సరి యైన క్రీ. శ. ౧౧౨౪ క్రోధి సంవత్సర పుష్య బ ౧ బుధవారము నాఁడు ౬ వ విక్రమాదిత్య చక్రవర్తి పెద్దకుమారుఁడైన చాళుక్య గంగ పేర్మాడి కుమార సోమేశ్వరుని యాజ్ఞంబడసిన తన్మహా ప్రధాని మనెవెర్గడచే (కొలనిపాకనుండి) గూడూరు మల్లేశ్వర దేవుని యంగరంగ భోగాలకుఁ గాను సర్వబాధా పరిహారముగా దానము చేయఁబడినట్లు 'గుముడూరు' (నేఁటి నామము గూడూరు) లో నొక శిలా శాసనము వేయఁబడి యున్నది. అందలి కన్నడ వాక్యము లివి.

"గుముడూర మల్లేశ్వర దేవర గుడిగ రంగ భోగ సెడె సర్వబాధా పరి (హార) సర్వ సమశ్యవాగి వేల్పుఁగొండ వీరబడియ బమ్మరిగయ ధారాపూర్వకం మాడిదరు" అని—

ఇందుఁ జెప్పఁబడిన యాబమ్మరి గ్రామమే బమ్మెర యైనది. ఇది నేఁటికి ౮౩౩ సం॥ల నాఁటి శాసనము. ఇందుఁ బేర్కొనఁబడిన గూడూరు, వేల్పుఁగొండ, వీరబడియ గ్రామములు పరస్పరము సమీపస్థములై బమ్మెరకు దగ్గఱలో నున్నవి.

పోతన వంశస్థులమని చెప్పుకొనువా రా గ్రామములో గొప్ప భూస్థితి గలవారై 'దొరలు' అను వ్యవహారమున నున్నారు. వారి యిప్పటి యింటిపేరు నెల్లుట్లవారు కాని తమ పూర్వులు నెల్లుట్ల చేరి వైష్ణవము పుచ్చుకొన్న విశేషములు గ్రంథస్థములైనవని సైతము వారు చెప్పెదరు - బమ్మెరలోఁ బోతన భాగవతము రచించినప్పటి చిహ్నములు గూడ వారు చూపెదరు బమ్మెరలో నుండు చెఱు వొకటి పోతనతల్లి యగు లక్కాంబపేర లక్కమ్మ చెఱువని పేర్కొనంబడుచున్నదట.

కనుక నేఁటి వరంగలు జిల్లా జనగాం తాలూకాలోని బమ్మెర గ్రామమే పోతన నివాసమనుట కే యభ్యంతరమును జెప్ప నవకాశముండదు.



# రెండవ ప్రకరణము

## బమ్మెర పోతన – కాలము

భోగినీ దండక కథానాయకుఁడును దత్కృతిపతియునగు సర్వజ్ఞసింగభూపాలుని కాలము దెలిసినయెడలఁ బోతనకాలము దెలిసినట్లే యగును.

ఈ సింగభూపాలుని ప్రపితామహుఁడగు మొదటి యనపోతానాయఁడు వేయించిన శాసనములు రాచకొండ, అయ్యనఁబ్రోలు (వరంగల్లు ప్రాంతము) మొదలగు ప్రదేశములలోఁ జెక్కలున్నవి. అవి క్రీ. శ. ౧౩౬౫ మొదలు ౧౩౮౦ వఱకును గానవచ్చెడిని కావున నతఁడు ౧౩౬౫ కుఁ బూర్వమే రాజ్యమునకు వచ్చి ౧౩౮౦ కిఁ బిమ్మటఁ గూడ రాజ్యము చేయుచు జీవించియుండవలెను. క్రీ. శ. ౧౩౮౪ వఱకే అతని రాజ్యకాలమనుకొన్నచో నాతని జ్యేష్ఠపుత్రుఁడుగా వెనుకటి ప్రకరణమునఁ బేర్కొనబడిన (పెద) వేదగిరినాయఁడు (బహుశః అయ్యలార్య కవిచే భాస్కర రామాయణ యుద్ధకాండమును బూర్తి చేయించినట్లు చెప్పఁబడుచున్న రాజు) క్రీ.శ. ౧౪౦౦ వఱకును రాజ్యముచేసియుండి నట్లూహింపఁ దగును. ఇతని తరువాతఁ గొంత మునలితనములో నీతని తమ్ముఁడగు ౨ వ తరము కావు సింగమనాయఁడు రాజ్యమునకు వచ్చియుండును. కనుకనే అతఁడు దన సింగభూపాలీయములోఁ దద్రచనాకాలమునకుఁ

దన కార్వురు కుమారులుండి వారు ప్రఖ్యాతులై నట్లును, వానప్పటికి దీర్ఘాయుష్మంతుఁడై యుండినట్లును నీ క్రింది

శ్లో॥ "అథ శ్రీ సింగభూపాలో దీర్ఘాయు ర్వసుధామిమాం."

అను శ్లోక భాగమునఁ దెలిపియున్నాఁడు. బహుశః అతఁడు క్రీ. శ. ౧౪౧౦ వఱకైన జీవించి రాజ్యము గావించి యుండవలెను. అతని పిమ్మట నాతని జ్యేష్ఠపుత్రుఁడగు నన్న పోతానాయుఁడు (కుమారాన్నపోతానాయఁడని భోగినీ దండకమునఁ జెప్పఁబడిన యతఁడు) మఱి ౨౦ సం॥లైన రాచకొండ రాజ్యమును బాలించియుండెననుకొన్నఁ దత్పుత్రుఁడగు భోగినీ దండక కృతిపతి సర్వజ్ఞసింగభూపాలుఁడు క్రీ. శ. ౧౪౩౦ ప్రాంతమున రాజ్యమునకు వచ్చియుండును. అతఁడు ౨౫ సంవత్సరములైన రాజ్యము చేసియుండునేని యాతని రాజ్యాంతకాలము రమారమి ౧౪౫౫ ప్రాంతమగును. బమ్మెర పోతన పండిత కీర్తనీయుఁడై యాతనికి భోగినీ దండకమును గృతి యిచ్చు నాటికి ౩౦ సంవత్సరముల యీడు గలవాఁడుగా భావింతు మేని యా కృతిపతి క్రీ. శ. ౧౪౪౦ ప్రాంతమున నగాఁ దాను రాజ్యమునకు వచ్చిన ౧౦ సంవత్సరములకుఁ గృతిపతిత్వాభిలాషమును దీర్చుకొని యుండెననుకొన్నవార మగుదుము. అట్లయినఁ బోతన క్రీ. శ. ౧౪౧౦ ప్రాంతమునఁ బుట్టియుండుననియొక నిశ్చయమేర్పడుచున్నది – ఇతనికి బావమఱఁదిగను నీతనిచేఁ బరిభవింపఁబడినవాఁడుగను లోకులచేఁ జెప్పఁకొనఁబడు శ్రీనాథకవి క్రీ. శ. ౧౩౭౦ ప్రాంతమున జన్మించియుండుననిి

కీ. శే. వీరేశలింగము పంతులు మొదలగు చరిత్రకారు లనేకులు సకారణముగా నిరూపించియున్నారు. క్రీ. శ. ౧౪౩౫ ప్రాంతము నకో మఱి కొలఁది సంవత్సరములకో నశించినట్లు నిశ్చయింపఁ దగు రాజమహేంద్రవరపు రెడ్డి రాజ్యమునందుండి తత్ప్రభుఁడగు నళ్ళయవీరభద్రున కంకితముగాఁ దాను కాశీ ఖండమును రచింపఁ బోవుచుఁ దత్పీఠికలో శ్రీనాథుఁడు చెప్పికొనియున్న సీసములోని

గీ॥ ప్రాయమింతకు మిగులఁ గై ప్రాలకుండఁ
గా శికాఖండ మను మహాగ్రంథ మేను
దెనుఁగు సేసెదఁ గర్నాటదేశ కటక
పద్మవనహేళి శ్రీనాథ భట్టసుకవి.

అను గీతమునుబట్టి కాశీఖండ రచన నాఁటి కతఁడు రమారమి ౬౦ సం॥ల వయస్సు గలవాఁడుగా నుండుననుట కవకాశ మున్నది. ఆ రచన ౧౪౩౦ ప్రాంతమున నై యుండవచ్చును. ఇట్టి యనేక సందర్భములను బట్టి శ్రీనాథ పోతనలు బావమఱఁదు లనుటకుఁగాని, తుదకు సమకాలికు లనుటకుఁ గాని యవకాశ మూఁడదని నేను జాలకాలమునుండి తలంచుచుంటిని.

ఇంతేకాని నేను మొన్న మొన్నటివఱకుఁ బోతనయొక్క భాగవ తేతరరచనలను జూచియుండలేదు. అందుకుఁ గారణము కొందఱు విమర్శకులు వానియెడ నేఁటివఱకును జూపుచున్న నిర్లక్ష్య భావవిలోకనము మాత్రమే.

ఈవలననఁగా రెండేండ్లనాఁడు చూతమని వీరభద్ర విజయమును, భోగినీ దండకమును గొని చదివితిని – అందు వీర భద్రవిజయము చదువుచుండఁగా ౩ వ అధ్యాయములోని ౩౭ వ పద్యమిట్లు పొడకట్టినది.

సీ॥ నీల కంఠునకును నెచ్చెలి గాఁడొకో
యటమటీఁడైన యీ యంబుజాక్షుఁ
డహికంకణునకు మూఁడవ కన్ను గాఁడొకో
పాటిమాలిన యట్టి పావకుండు
గంగాధరునకు సంగడి కాఁడు గాఁడొకో
పెను కూళ్ళ మాఱైన యనిమిషపతి
పురవైరికిని దల పువ్వంబు గాఁడొకో
నిర్భాగ్యుఁడైన యీనీరజారి

గీ॥ యేమి కుడువంగ వచ్చితి రిందు మీరు
తాము (తమరు – బహుశః) పాలించునట్టి లోకములు విడిచి
పంచవదనుని కను జేగురించె నేని
తక్షణంబునఁ దమ యాళ్ళ త్రాళ్ళు దెగవె.

దీనిం జదివినతోడనే కాశీఖండములో నంతకు ముందు నా చదివియున్న

సీ॥ శితికంఠునకును నెచ్చెలికాఁడు గాఁడొకో
యటమటీఁడైన యీ యక్ష భర్త
యహికంకణునకు మూఁడవ కన్ను గాఁడొకో
పాల్మాలినట్టి యీ పావకుండు

పురవైరి కవతంస పుష్పంబు గాఁడొకో
నిర్భాగ్యుఁడైన యీ నీరజారి
గంగా ధునకు లెంకల లెంక గాఁడొకో
పెనుగూళ్లైన యీ యనిమిషేంద్రు

గీ॥ ఏమి గుడువంగ వచ్చినా రిండ్లు విడిచి
హరుని వెలివెట్టినట్టి యీ యాగమునకుఁ
బంచవదనుని కను జేవురించె నేని
దక్షిణము నందు తమ యాంధ్ర ట్రాళ్ళు పెగవె.

అను పద్యము జ్ఞప్తికి వచ్చినది. ఇందు 3, ౪ పాదములు మాత్రము పోతన గ్రంథములో వెనుకముందులైనవి. తక్కిన విశేషములు - వారి వారికిఁ గల సామర్థ్య తారతమ్యమును దెలుపుచున్నవి. కాశీఖండ పద్య మాతని (శ్రీనాథుని) సహజ చాతురీ విశేషమునకును, నాతని యసాధారణ ప్రౌఢిమకును ననురూపముగ నున్నది. వీరభద్రవిజయములోని పద్యము పోతనయొక్క యల్పవయస్కతకును, నాతని యనుకరణోత్సాహమునకును దగినట్లేయున్నది. ఇంకొక విశేషమును గలదు. శ్రీనాథుఁడు శైవపక్షపాతియనుట తద్గ్రంథ రచనల వలననే పొడకట్టుచున్నది. అయినను నతఁ డంత విష్ణుద్వేషి కాఁడు. పోతన శైవమత సంప్రదాయములోనివాఁడే. అందును వీరభద్రవిజయ రచన తన్మతాగ్రహ రీతి కొక యుదాహరణమై యున్నది. బాల్యము పట్టుదలలకునికి పట్టుగదా! చూడుఁడు— శ్రీనాథుఁడు. "శితికంఠునకును నెచ్చెలికాఁడు గాఁడొకో యటమటీఁడైన యీ యక్షభర్త" అని కుబేరనిందాత్మకముగా

సచించియుండఁ బోతన "నీలకంఠునకును నెచ్చెలి గాఁడో కో చటుపటీరైన యీయంబుజాక్షు" డని విష్ణునిందాత్మకముగా నీ పద్యపాదమును మార్చినాఁడు. శ్రీనాథుఁడు కాశీఖండ రచనా కాలమునకు ౬౦ సం॥ల వయస్సున నుండుననియుఁ బోతన వీర భద్రవిజయ రచనా కాలమునకు ౨౦ సం॥లు మించినవాఁడు గాఁడనియుఁ దెలుపుటకు నాయా గ్రంథములందలి వారి వారి (ప్రాయమింతకు మిగుల నై వ్రాలకుండ. కా. ఖం.) (పిన్నవాఁడ ననియుఁ బెక్కు సత్కృతులను వీరభద్రవిజయము) వాక్యముల నుదాహరించియే యుంటినిగదా! ఆ నిర్ణయ మీయను కరణములవలన నింకను బలవత్తర మగుచున్నది.

పోతన ప్రౌఢ వయస్సున వ్రాసిన భాగవతమునందును నచ్చటచ్చటఁ గొన్ని యనుకరణములున్నవి. వీనిని విమర్శకు లింతకుముందే ప్రకటించియున్నారు. భాగవత మూలమున లేని సత్యభామా యుద్ధమును నాచనసోముని హరివంశము నుండి గ్రహించి తన భాగవతమునఁ జెప్పుటయేకాక పోతన యా సోముని పద్యములనే కొన్నింటి ననుకరించినాఁడని శ్రీమాన్ వేంకటరమణాచార్యులుగా రా పద్యములను దమ భాగవత పీఠికలో నుదాహరించియున్నారు.—

ఆ యనుకరణముల నే నిచ్చటఁ జూపుచున్నాను — చూడుఁడు. నరకాసుర యుద్ధ ఘట్టమున—

మ॥ అరిఁజూచుఁ హరిఁజూచుఁ జూచుకము లం దంద మందార కే
సరమాలా మకరంద బిందు సలిలస్యందంబు లందంబులై

తోరగం బయ్యెదకొం గొకింత తొలఁగం దోడ్తో శరాసారముం
దర హాసామృత పూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్.

(నాచనసోముని ఉత్తర హరి వంశము)

మ॥ పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషతారోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారముం
జరగం గన్నులఁ గెంపు సొంపుఁ బరగం జండాస్త్ర సందోహమున్
బరసాలోక సమూహమున్ నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్.

(భాగవతము. దశ - ఉత్తర.)

సీ॥ తంత్రీ వినోదంబు దడవు సైపని వ్రేళ్ళు
గోనయానంపుఁ దెగలపైఁగోరి కనుట
అద్దంబు పిడిముట్ట నలయు పాణి తలంబు
లస్త్రకం బిఱియించు లావు కలిమి
చెలికత్తె నొత్తిలి పిలువలేని యెలుంగు
సింహనాదంబునఁ జెదర కునికి
ప్రమదనర్తన కేళిఁ బంతగింపని పదం
బైదు రాణంబుల వలత వడమి

గీ॥ సోయగపుఁ జిత్రరూపంబుఁ జూచుచోఁట
వేసరు విలోకనంబులు వికృత దైత్య
లక్ష్య మీక్షించుటలు మెక్కలంపుఁ దెంపు
గైకొనియె సత్యభామ సంగ్రామ సీమ.

(ఉత్తర హరివంశము.)

సీ॥ వీణఁ జక్కఁగఁబట్టి వెరవెఱుంగని కొమ్మ
బాణాసనంబెట్టు పట్ట నేర్చె
బ్రమఁసినఁ దీగఁ గూర్పంగ నేరని లేమ
గుణము నేర్కియు ధనుఃకోటిఁ గూర్చె
సరవి ముత్యము గ్రువ్వఁ జాలని యబల యే
నిపుణత సంధించె నిశిత శరము.
జిలుకకుఁ బద్యంబుఁ జెప్ప నేరని తన్వి
యస్త్ర మంత్రము లెన్నఁ డభ్యసించె

గీ॥ బలుకు మనినఁ జెక్కు పలుకని ముగుదయే
గతి నొనర్చె సింహ గర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగ దభిరామ గుణధామ
చారు సత్యభామ సత్యభామ.

(భాగవతము. దశ - ఉత్తర.)

ఇంతేకాదు భారత భాస్కర రామాయణాదులగు పూర్వకవుల కావ్యములలోని పద్యములఁ గొన్నింటిని బోతన యేకారణమునైన నేమి తన కావ్యములలో ననుకరించిన జాడ లెన్నేని గలవు. కావునఁ బోతన తన బాల్యశేషమున రచించిన వీరభద్రవిజయములో సమానఘట్టమునందు శ్రీనాథ కవి పద్యము ననుకరించె నన్న నది వింతగాదు.

ఇట్లు రమారమి తన వృద్ధాప్యమున శ్రీనాథ కవి రచించిన కాశీఖండ పద్యమును బోతన తన బాల్యమున రచించిన వీరభద్రవిజయములో ననుకరించుటనుబట్టి యీ యిద్దరు కవులకును గనీసము ౪౦ సంవత్సరములైన వయోభేదముండ

నని తలంచుటలో నే యభ్యంతరమును గానరాదు. అనుకర ణానుసరణములు సకలకవులకును గొంచెము గొప్పల స్వాభావిసిద్ధములే యైయున్నవి. తమకు బాగుగా నచ్చిన పూర్వకవుల వాక్యములను రసైక పరాయణులైన తరువాతి కవులు దమకు వారియెడఁ గల సంభావనా బుద్ధిని బ్రకటించుటకే యనుసరింతురు. ఇప్పటి కవుల కిది యొక దోషముగాఁ బొడకట్టునని వా రెఱుంగరు గదా!

పైఁ జెప్పఁబడిన కారణమును బట్టి పోతన క్రీ.శ. ౧౪౧౦ ప్రాంతమున జన్మించి ౧౪౭౦ వఱకైన నన(గా నఱువది సంవత్సరములైన జీవించియుండు ననియు, భాగవత రచన యాతని తుది కార్యము గావున నది ౧౪౬౦-౬౫ ప్రాంతమున నారంభింపఁబడి యుండనోపు ననియు నేను దలంచుచున్నాను. శ్రీనాథుఁ డంత్యకాలమునఁ గొన్ని కష్టము లనుభవించినట్లే పోతన్న హరిభక్తుఁడైనను గడపటి దశలో నేదేనిఁ గొంత దుర్దశ ననుభవించి యుండు ననవచ్చును. అదే భాగవత గ్రంథ శైథిల్యాదులను గూర్చి లోకులు చెప్పుకొను చిత్రకథలకు బీజమైయుండవలెను. పోతన భోగినీ దండకమును గృతిగొన్న సర్వజ్ఞసింగభూపతి యీ భాగవతమును గృతిఁబొందఁగోరి యందుల కా కవి సమ్మతింపనందున నాతని ననేక విధముల బాధించినట్లొక కథ పుట్టినది. ఈ సందర్భమున శ్రీనాథకవి సింగభూపాలునికిని బోతనకును నడుమఁ గొంత రాయబారము నడపినట్లును జెప్పఁబడుచున్నది. కాని యిందు నమ్మఁదగిన యంశ మేమియుఁ గానరాదు. ఇట్టి యీ యసంగత వృత్తాంత

మును నమ్మి పోతన కాలమునకుఁ దరువాత రెండు మూఁడు నందల యేండ్లకుఁ బుట్టిన కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణ సార సంగ్రహములో నీ క్రింది పద్యమును వ్రాసియున్నాఁడు. అది సర్వజ్ఞసింగభూపతి జీవితమునకే కళంకమాపాదించి దానిని లోకమున శాశ్వతపఱిచినది – చూడుఁడు.

సీ॥ ఘనుఁడు పోతన మంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించు వేడల
సర్వజ్ఞసింగమ క్ష్మావరుం డది తన
కిమ్మని వేఁడఁగా నీయకున్న
నలిగి యా పుస్తకం బవనిఁ బాతించినఁ
జివికి యం దొక కొంత శిథిలమయ్యెఁ
గ్రమ్మఱ నది వెలిగందల నారప
రాజును, మఱి బొప్ప రాజు గంగ

గీ॥ రాజు మొదలగు కవివరుల్ తేజ మెసఁగఁ
జెప్పి రా గ్రంథముల యందె తప్పు లేదవేఁ
గాని పోత కవీంద్రుని కవితయందు
లక్షణం బెందుఁ దప్పు నా దక్షహరణ.

(సర్వలక్షణ సారసంగ్రహ పీఠిక.)

పోతన దారిద్ర్యబాధను జూచి శ్రీనాథకవి.

క॥ కమ్మని గ్రంథం బొక్కటి
యిమ్ముగ నే నృపతికైనఁ గృతియిచ్చినచోఁ
గొమ్మని యీ యారడే తా
కిమ్మహి దున్నంగ నేల యిట్టి మహాత్మా!

అని యొక పద్యము చెప్పినట్లును వాడుక గలదు. ఇవన్నియు నీవలి కథక చతురుల చేఁ గల్పింపఁబడిన చిత్రకథ లే కాని యన్యములుగావు.

భాగవత ద్వితీయ ముద్రణమునఁ గాఁబోలుఁ దత్పీఠి కను రచించిన పురాణం హయగ్రీవ శాస్త్రిగారు పోతనా మాత్యుఁడు వరంగలు ప్రాంతవాసి కాఁడనుట కేమేమో వ్రాసియున్నారు. కాని యవి యన్నియు "గతాను గతికో లోకః" అను న్యాయమునఁ బుట్టినవే కనుక మనమట్టి వానినెల్ల నుపేక్షింప వచ్చును.

పోతన్న వరంగలు జిల్లాలోని బమ్మెర నివాసియే యని ఖండితముగా విశ్వసించిన శ్రీ శేషాద్రిరమణ కవులు గూఁడ దాము వ్రాసియున్న వావిళ్ళవారి భాగవత పీఠికలోఁ బోతన కాలనిర్ణయము చేయుపట్టునఁ దమ కుపలబ్ధములైన ప్రమాణము లను సహా సరిగా నన్వయించికొనియుండలేదు.
అందలి వారి వాక్యము లివి—

"పూర్వ పీఠికాకారులు పోతరాజు జీవిత కాలము క్రీ. శ. ౧౪౨౦ ప్రాంతమని నిరూపించిరి. కీర్తి శేషులగు వీరేశ లింగము పంతులుగారు ౧౪౭౫ వ కావలి వాఁడని క్రొత్త కూర్పులో సవరించి యున్నారు. చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు వేఱొక విధముగా వ్రాసిరి. పోతరాజు వీరండ ఉదాహరించి సంతకంబె (బూర్వ కాలమున నున్నటులఁ గొన్ని యాధారములు గానవచ్చుచున్నవి. పోతరాజాంధ్ర కవులలో

నన్నయభట్టారకుని దిక్కనసోమయాజిని మాత్రమే ప్రశంస చేసెను. శంభుదాసుని ప్రశంసఁ గావింపకుండుటచే నాతనికి సమకాలికుఁడో యాతని రచనము వెల్లడి కానంతటి సమీప కాలముననో యుండి యుండునని విశ్వసింపవలయును. లేకున్న కవిస్వాయమునే ప్రశంసింపవలసిన ప్రశస్తి తటస్థింపఁజాలదు."

పై వాక్యములనుబట్టి క్రీ. శ. ౧౩౫౦ ప్రాంతమునఁ బ్రోలయవేమభూపాలుని కొలువులోనున్న యెఱ్ఱా ప్రగ్గడకు సమకాలీనుఁడో తద్రచనలు ప్రఖ్యాతికి రానికాలమున ననఁగా క్రీ. శ. ౧౪౦౦ లోపల భాగవత రచన కారంభించినవాఁడో కానలెనని కదా! వారి యభిప్రాయము. తరువాతివారి వాక్యములు.

"పోతన్న కవిచక్రవర్తియగు నాచన సోమనాథున కించుక యీవలివాఁడు – సుప్రసిద్ధ కవియగు మడికి సింగన కవికిఁ బైకాలమువాఁడునై యుండెను – కాన నీ యుభయ కవుల మధ్యకాలమున నున్నటుల స్థూలదృష్టిచేతను నుపలబ్ధములగు నాధారములచేతను గూడ నిరూపింపనగును." E. A. [illegible]. 30-5-1962.

పోతన భాగవతమున నన్నయ తిక్కనల మాత్రమే వర్ణించుటయును కారణముచే నెఱ్ఱాప్రెగ్గడకుసైతము సమ కాలికుఁడగునేమో యని యూహింపఁ దొరకొనినవారు పోతనను సోమనాథకవికంటె నీవలివాఁడనుట యంత సంగ తముగాదు. ఏలయన ? నాచన సోమనాథుఁడు ౧౩౭౦ ప్రాంత మున రాజ్యము చేయుచున్న విజయనగరాధిపతి యగు బుక్క

భూపాలునిచే దానము పడసినవాఁడు. ఎఱ్ఱాప్రగ్గడ ౧౩౫౦ ప్రాంతమువఱకే రాజ్యము చేసినట్లున్న వేమభూపాలుని యాస్థానకవి. కనుక నెఱ్ఱాప్రగ్గడ సోమనాథులలో సోమనాథుఁడే యీవలివాఁడగును. పోతన యీతని కీవలివాఁడగు నేని యెఱ్ఱన్న కంటె నింకను నీవలివాఁడు గావలెఁగదా! అట్టి యర్వాచీనుఁడు సోమనాథుని హరివంశమును జూచి యందలి పద్యముల ననుకరించి (అనుకరించినట్లు వారే వ్రాసినారు) యుండఁగా నెఱ్ఱాప్రగ్గడ హరివంశము నేల చూడకుండును. విజయనగరాస్థాన కవికంటెఁ గొండవీటియాస్థాన కవి పోతనకు సమీపస్థుఁడు గూడనగును. కవిస్తుతిని బట్టి కవి కాలమును నిర్ణయించుట యుక్తమగు నేని, పోతన వారు చెప్పినట్లే తనకుఁ బూర్వుఁడైన సోమనాథునైన నెందుకు సన్నుతింపలేదు ? కాఁబట్టి కవిస్తుతి యనునది కాలనిర్ణయము నెడ నకించిత్కరమని తేలుచున్నది. ఇఁక మడికిసింగనను బోతన కీవలివాఁడుగా భావించి వారు వ్రాసిన వాక్యములనుగూడఁ బరికింతము.

"పోతన ననుకరించిన ప్రాచీన కవి మడికిసింగరాజు. ఇతఁడు పోతరాజు భాగవతములో ఖిలమైన దశమస్కంధ కథను ద్విపద కావ్యముగ వ్రాసియున్నాఁడు. భాగవతములోని పద్యముల ననుకరించి సింగన పద్మపురాణములో బెక్కు పద్యములు వ్రాసియున్నాఁడు. వాని నుదాహరించుటచే గ్రంథ విస్తరమగును. సింగనపద్మ పురాణములోని "మడికిసింగన తెన్గుఁగున రచించెఁ దగఁ బద్మపురాణం। బా కమల మిత్ర శశితారకముల్" అను పద్యభాగముచే క్రీ.శ. ౧౪౨౦ ప్రాంతమున

నుండి యుండెను. పోతరాజో యీ యిరువురు కవులకు మధ్య కాలమగు క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతములోఁ బ్రౌఢవయస్కుఁడై యుండియుండును."

పద్మపురాణము నేనొకసారి చదివియుంటిని. తత్కర్త యైన సింగన పోతన ననుకరించిన పద్యములు నాకందుఁ గానరాలేదు. ఒకవేళ సమానచ్ఛాయ లెందేని యున్న నవి యెవ్వ రెవ్వరి ననుకరింపఁగా నేర్పడినవో నిశ్చయించుటకు మరలఁ గాల చర్చయే కావింపవలసి వచ్చును. సింగన దశమస్కంధ రచనకును బోతన దశమస్కంధ దర్శనము గారణమని గట్టిగాఁ జెప్పనలవికాదు. పోతన రామభక్తుఁడైన నగుగాక యతఁడు వైష్ణవగురు భక్తుఁడుగాఁడు. సింగన తాను వైష్ణవగురు శిష్యుఁడనని పద్మ పురాణములోనే చెప్పుకొనియున్నాఁడు. భాగవతములో దశమస్కంధ మొక్కటే భగవంతుఁడగు శ్రీ కృష్ణుని చరిత్రాంశ బద్ధమైనది. సింగన తావన్మాత్ర రచనకే పూనుకొని యుండ వచ్చును. పోతన భాగవతము నంతయుఁ దెలిగింపఁ బూనినవాఁడు. కనుక వీరిరువురికిని భావైక్యముగూడ నుండనక్కఱ లేదు. సింగన ద్విపదకావ్యమును దాము చూడలేదని పైతమువారు వ్రాసియున్నారు. ఇది యిట్లుండనిచ్చి సింగన తన పద్మ పురాణ పీఠికలోఁ దద్రచనాకాలమును దెలుపుకొన్న పద్యము.

"ఆకర యుగానల మృగాంక శకవత్సరము లైవరగు శార్వరిని బుణ్య ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్చునుడు పాలసుతవాసరమునందుఁ<sup></sup>.

అనునది. దీనిని బట్టి యతఁడు కావ్యమును – శాలి వాహనశకము ౧౩౪౨కు సరియైన శార్వరి సంవత్సరము మార్గశిర శు ౫ బుధవారమునాఁడు ప్రారంభించినట్లు తేలును. ఇది క్రీ.శ. ౧౪౨౦ డిశంబరు ప్రాంతకాలము – సరేకాని పోతన ౧౪౦౦ ప్రాంతమున కే ప్రౌఢవయస్కుఁడై యుండుననుట నూహ సరియయినదికాదు. ఏలయన – వారు తమ భాగవత పీఠికలోఁ బోతన కాలనిర్ణయమునకు మఱియొక మార్గమును గూడఁ జూపించినారు. అందులకు వారి వాక్యములు.

"పోతరాజువలన భోగినీ దండకమును గృతిబొందిన వాఁడును భాగవతాంకిత మభిలషించినవాఁడును నగు సర్వజ్ఞ సింగభూపాలుఁడు పిల్లలమఱ్ఱి బేతాళనాయని కేఁడవ పురుషుఁడు. సోమకుల పరశురామాది బిరుదాంకితుఁ డగు నన పోతరాజున కాత్మజుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమున నుండెను. సమకాలికుఁడని చెప్పఁబడు శ్రీనాథకవిసైతము క్రీ.శ. ౧౪౦౮ నాఁటికి వేమభూపాలువద్ద విద్యాధికారి గనునట్లు పొన్నుపల్లి తామ్ర శాసనములోని "విద్యాధికారీ శ్రీనాథో వీర శ్రీ వేమ భూపతేః" అను వాక్యముచే వ్యక్తమగుచున్నది. ఇన్నింటిని సమన్వయించి పోతరాజు క్రీ. శ. ౧౪౦౦ లో భాగతమును రచించి యుండుననియు భాగవత పూర్వ ముద్రాపకులు నిర్ణయించినటుల పోతరాజు క్రీ.శ. ౧౩౭౫ ప్రాంతమున జనించి యుండుననియుఁ దలంచుటయే సమంజసము."

మరలఁ బోతన గ్రంథముల వివరించు సందర్భమున వారే. "కానియందు సర్వజ్ఞ సింగభూపతి జననినామము వేఱు

గను రసార్ణవ సుధాకరమునందు వేఱుగను జెప్పఁబడియున్నది. ఆయమకు నామాంతరమున్నదేమో" అని తమ సందేహ పరిష్కారముల రెంటిని వారే చేసికొన్నారు. కావి యాభేదమును స్పష్టముగా సప్రమాణముగా వివరించినవారుకారు.

రసార్ణవ సుధాకరకర్తకును భోగినీ దండక కృతిపతికిన్ని దల్లినామము మాత్రమే వేఱుగానుండలేదు. తండ్రినామము గూడ భిన్నమైనదే. కవులు తమ పీఠికలో 2 వ తరమువాఁడుగా వ్రాసియున్న సింగమ నాయఁడు తన రసార్ణవసుధాకర పీఠికలో మొదటఁ దండ్రిని గూర్చి

శ్లో॥ "సోయం శ్రీపతి రన్నపోతనృపతిః కింత్వానవాంభోరుహే
థత్తే చారు సుదర్శనశ్రియమసౌ సత్వాత్మ హస్తాంబుజే"

అను శ్లోకమున మొదలిడి ౫ శ్లోకములలో విరివిగా వర్ణించి తరువాతఁ దన తల్లిని గూర్చి

శ్లో॥ అన్నమాంబేతి విఖ్యాతా తస్యా సీద్ధరణీపతేః
దేవీ శివా శివ స్యేవ రాజమాళే ర్మహోజ్జ్వలా

అను శ్లోకమునుండి వర్ణింపఁ గడఁగినాఁడు. ఇందువలన నా 2 వ తరము సింగభూపాలుఁడు. అనపోతానాయనికిన్ని అన్నమాంబకును బుట్టిన యిద్దరు పుత్రులలోఁ జిన్నవాఁడు — మఱియు నాతఁడెచ్చటను దనకు సర్వజ్ఞ బిరుదమున్నట్టు చెప్పు కొని యుండలేదు.

భోగినీ దండక కృతిపతియో ఆ దండకమునందున్న "కుమారాన్నపోతావనీనాథసూనుః" "పోచమాంబాలసద్గర్భ సంజాతు" అను వాక్యములనుబట్టి కుమారశబ్దవిశేషణ విశిష్టుఁడైన అనపోతానాయునికిని బోచమాంబకును బుట్టిన కుమారుఁడు. మఱియుఁ బోతన యీ దండకములోఁ బెక్కుసార్లు – "మహోదార చారిత్రు సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షు" "మాయారమానాథు సర్వజ్ఞ సింగక్షమానాథు" "ముద్దుపట్టీ భవద్భ్రాతురిం బట్టి సర్వజ్ఞసింగక్షమానాథుఁ దప్పించి దర్శించి" "వధూలోక పాంచాలు సర్వజ్ఞసింగక్షమాపాలుఁ గైకొంటి తప్పే" అని యాతనిని సర్వజ్ఞ సింగభూపాలునిగఁ బ్రకటించుచున్నాఁడు ఈతని పితామహుఁడును రసార్ణవసుధాకరకర్తయు ననఁదగిన యీ 2 వ తరము సింగభూపాలుని జెప్పినప్పుడు.

రావుసింగక్షమానాథ పౌత్రః అని యారంభించిన వాక్యక్రమములోనే వరుసగా "సమీచీన రేచెర్ల గోత్రాంబుజాతాత్మ మిత్రః మహోదార చారిత్రు సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షు" అని యిరువుర భేదమును గూడఁ దెలుపుచున్నాఁడు రసార్ణవ సుధాకరకర్తకు వేదగిరీశ్వరుఁ డను జ్యేష్ఠభ్రాత మాత్రమే యున్నాఁడు.

శ్లో॥ తయోరభూతాం పుత్రౌ ద్వౌ రాద్యో వేదగిరీశ్వరః
ద్వితీయ స్త్వతే ద్వితీయోపా యశసా సింగభూపతిః.

భోగినీ దండక కృతిపతికి జ్యేష్ఠభ్రాత యొకఁడున్నట్లు లేదు. కాని "సీమంతినీ మానసారామవాటీ వసంతః,

వసంతావనీ నాథ సంసేవితాంచత్పదాం భోజు" అని యున్న వాక్యము ప్రకారము వసంతనాయఁడను తమ్ముఁ డున్నట్లు మాత్రము దెలియవచ్చుచున్నది. ఈ వసంతనాయునిపైఁ బూర్వ కవులు చెప్పిన పద్యమని సురభివారి వంశచరిత్రములో

చ॥ నడవడి చక్కఁగా దొకదినంబును బుక్కిటఁ జేను మానఁడే
ర్పడ విన వీను లేగు పెను పండువునందును గాలిఁగ్రోలు నీ
బడుగును బొంద నేల యని బాసి ఫణిం జనుఁడెంచి కాడె యా
పుడమి వరించె వేడ్కఁ నృపపుంగవు రావు వసంతరాయనిన్.

అను పద్యము ప్రకటింపఁబడినది.

ఈవిధముగా నెట్లు చూచినను భోగినీ దండక కృతిపతి కిని రసార్ణవసుధాకరకర్తకును నెంతో భేదము కానవచ్చు చున్నది. రసార్ణవసుధాకరకర్త క్రీ.శ. ౧౪౦౦ ప్రాంతమున రాజ్యము చేయుచుండెనని శ్రీ శేషాద్రిరమణ కవులు వ్రాసినది యించుమించుగా సత్యమే. ఏలయన నీతని తండ్రి శాసనములు క్రీ.శ. ౧౩౮౦ వఱకు నున్నవి, తండ్రి పిమ్మట నీతని జ్యేష్ఠ భ్రాత వేదగిరినాయఁడు కొంతకాలము రాజ్యము చేసియుండవలె. ఇట్లు తత్కనిష్ఠ భ్రాతయగు నీ సింగమనాయఁడు రాజ్యమునకు వచ్చుసరికి వారు చెప్పినట్లు ౧౪౦౦ ప్రాంతము గాఁగలదు. ౧౪౦౮ లోఁ దాను రచించిన పొన్నుపల్లి శాసనమును బట్టి శ్రీనాథ కవి – అప్పటికే కనీసము ౩౫ సంవత్సరములైన నిండిన వాఁడు కాఁదగును. కావున నా మహాకవి దర్శించినది యీ తాత సింగమనాయనినే యైయుండవలెను.

అందుకే "రావుసింగమహీపాలు ధీవిశాలు" అని యాతనిని బేర్కొన్నాఁడు. ఈ రావుసింగభూపాలునికిఁ దన దండక కృతిపతి పౌత్రుఁడని పోతన స్పష్టముగా

"రావు సింగక్షమా పాలపౌత్రుఁ"
"కుమారాన్నపోతావనీ నాథసూనుఁ"
"సర్వజ్ఞ సింగక్షమానాథు"

అను వాక్యములలోఁ దెలియఁ జేసియున్నాఁడు ఈ తాతా మనుమలను జూచి బహుమానము లందిన శ్రీనాథ పోతనలు గూడఁ దాతా మనుమల కున్నంత వయోభేధము గల వారనుట యెటుచూచినను స్థిరపడుచున్నది.

రసార్ణవసుధాకరకర్త గొప్ప విద్వాంసుఁడును వయోవృద్ధుఁడు నై యుండుటచేతనే తత్సభాప్రవేశకాలమున శ్రీనాథ కవి కొంత జంకును బ్రకటించినాఁడు. దీనార టంకాల పద్యమున భోగినీ దండక కృతిపతి చిల్లరమల్లరలు కొంతకుఁ గొంత చదివి డంబమునకు నిజాశ్రిత వర్గమిచ్చిన సర్వజ్ఞ బిరుదమును ధరించుచూ భోగినీ విలాసవినోదియై యుండుటచేతనే తత్సన్నిధానమునఁ బోతనామాత్యుఁడు వాని భోగినిని వర్ణించి సంతోషపెట్టినాఁడు తన దండకమున. శ్రీనాథుఁడీ తని గూర్చి చెప్పినట్లున్న

క॥ సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
యుర్విం జెల్లును నితరుల
సర్వజ్ఞం డనుట కుక్క సామజమనుటే.

అను పద్యము దాని రచనను బట్టియే యమ్మహాకవిది గాదని గ్రహింపఁ దగియున్నది. కాని యా రాజును బరిభవింపఁ దలఁచిన యే కవియో యిట్లు చమత్కరించి తృప్తిఁజెంది యుండవచ్చును — కనుక నీ విషయము నింతటితో ముగించి పోతన జీవితకాలపు రాజకీయ పరిణామముల నిఁకఁగొంత విచారించి చూతము.

పోతన నివాస ప్రాంత భూమి తజ్జన్మ కాలమునకు రసార్ణవసుధాకరకర్త యగు రేచెర్ల రావుసింగమనాయని పాలనమునందే యుండవచ్చును. తరువాతఁ దజ్జ్యేష్ఠ పుత్రుఁడగు కుమారాన్నపోతానాయఁడా దేశమును గొంత కాలము పాలించి యుండవచ్చును. తదనంతరము తత్పుత్రుఁడగు నీ సర్వజ్ఞ సింగమనాయఁడు రాజై క్రీ.శ. ౧౪౪౦ ప్రాంతమున షుమారు 30 సంవత్సరముల వయస్సులో నున్న పోతనామాత్యుని కాశ్రయమిచ్చి యా భోగినీ దండకమును వ్రాయించి కొని యుండును. కనుకఁ బోతన జీవితములోని ముఖ్యభాగ మీ సర్వజ్ఞుని రాజ్యకాలముననే కడచిన దనవచ్చును. అయినను నీ హిందూరాజులు స్వతంత్రులై రాజ్యముచేసిరో పరాధీనులో నిశ్చయింప ననుకూల సాధనములులేవు. ఆ కాలమున ఢిల్లీ రాజ్యమును ద్రోసిరాఁజని అల్లావుద్దీన్ హసన్ గంగూ అను

నతని వంశజులు మొదట గుల్బర్గాలోను బిదప బిదరులోను నుండి మహారాష్ట్ర కర్నాట దేశభాగములనేకాక సన్నిహితమైన తెలంగాణ భాగముఁనుగూడఁ బాలించుచుండిరి. వారిలో ఫిరోజిషా అనువాఁడు ౧౩౯౭ మొదలు క్రీ.శ. ౧౪౨౨ వఱకును రాజ్యముచేసెను. ఇతఁడు ౧౪౧౯ ప్రాంతమునఁ దెలంగాణా పైకి దాడివెడలి రాఁగా రేచర్ల వంశములోని శాఖాంతరమున జనించి (నేఁటి నలగొండ జిల్లా) దేవరకొండ రాజధానిగా రాజ్యముచేయుచున్న ౮ వ తరము రామచంద్ర నాయఁడు వానిని బండికనుమయొద్ద నెదిరించి వెనుకకుఁ దఱిమినట్లు సురభివారి చరిత్రములోని తద్వర్ణనాత్మకమైన యీక్రింది

గీ॥ కడిమిమై నీవు తగ బండి కనుమ యొద్దఁ
బరగ ఫేరోజి సురధాను పరిభవించి
కదనమున నార! గెలిచితి కన్నడీల
రమ్య దేవేంద్ర వేదయ రామచంద్ర.

అను పద్యమువలనఁ దెలియుచున్నది. ఈ ఫిరోజిషాను శ్రీనాథకవి తన హరవిలాసములోఁ దత్క్యాతినాయకుని తమ్ముఁడగు తిరుమలసెట్టి వర్ణన సందర్భమునఁ బేర్కొనియున్నాఁడు.

చ॥ హరిహర రాయ ఫేరోజి మహా సురధాన గజేశ్వరాది భూ
వరులు నిజప్రభావ మభి వర్ణనసేయఁ గుమార గిర్యధీ
శ్వరుని వసంత వైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికిని ధీగుణభట్టికి నెవ్వఁడీ డగున్. —అని

ఇందుఁ బేర్కొనఁబడిన హరిహరరాయలు. క్రీ.శ. ౧౩౭౭ మొదలు ౧౪౦౪ వఱకును విజయనగర రాజ్యము పాలించిన రాజు – ఫేరోజ మహాసురధాను గుల్బర్గా పాలకుఁడుగాఁ బైనఁ బేర్కొనఁబడిన బహమనీ సుల్తాను. గజేశ్వరుఁడు (గజపతి) కళింగరాజైన నాల్గవ భానుదేవుఁడో అతని తండ్రి యగు నరసింగభానుఁడో కావలెను. (౧౪౨౭ ప్రాంతమున నాల్గవ భానుదేవుఁడు గలఁడు) ఇఁకఁ గుమారగిర్యధీశుఁడు కొండవీటిరెడ్డి ప్రభువు. ఇతఁడు క్రీ.శ. ౧౩౮౦ మొదలు ౧౪౦౦ వఱకును రాజ్యము చేసెను. కుమారగిరి వసంతోత్సవమును సర్వము తానే నిర్వహింపఁగలిగిన యా తిరుమలసెట్టి తద్రాజ్యాంతకాలమునకు గనీసము ౩౦ యేండ్ల ప్రాయమునవైన నుండవలెఁగదా. శ్రీనాథుఁ డాతని యన్నకు బాల్య సఖుఁడట. కృతిపతియైన ఆ యన్న అవచితిప్పయసెట్టి తన్నుఁగూర్చి

౧ గీ॥ ఉభయ భాషా కవిత్వ ప్రయోగ కుశలు
బాల్య సఖుఁ గారవించి తాత్పర్యమెసఁగ
నవచి దేవయ త్రిపురారి యక్షరాజు
హితమితోక్తులు వెలయంగ నిట్టులనియె.

౨ గీ॥ ఆగమ జ్ఞాననిధివి తత్త్వార్థ ఖనివి
బహు పురాణజ్ఞుఁడవు శుభభవ్యమతివి
బాలసఖుఁడవు శైవ ప్రబంధమొకటి
యవధరింపుము నా పేర సంకితముగ.

అన్నట్లు తన హారవిలాస పీఠికలోఁ చెప్పకొన్నాఁడు. ప్రసక్తాను ప్రసక్తమైన యీ విషయముగూడ శ్రీనాథుని వయోవిశేషమును నిరూపించుచున్నది. ఇంకఁ బ్రకృతము నను సంధింతము.

పైఁ జెప్పఁబడిన ఫిరోజిషా యంత్యకాలమువఱకును తెలంగాణాకుఁ దురకలదాడి యంతగానుండ లేదు. కాని వీని తమ్ముఁడు అహమ్మదువలీషా ౧౪౨౨ లో రాజ్యమునకువచ్చి తరువాతఁ గొలఁది కాలములో రాజధానిని బిదరుకు మార్చి యాంధ్రదేశమున కత్యంత సన్నిహితుఁడై నది మొదలు తెలంగాణా వారి కత్యంత భయహేతువు లేయుండెను. అయితే క్రీ. శ. ౧౪౩౫ వఱకే యీతని రాజ్యము గావున పోతన యీ నాఁటికి ౨౫ సంవత్సరములకంటె నధిక వయస్కుఁడై యుండఁడు. అప్పటి కతఁడు వీరభద్రవిజయమును మాత్రమే రచించి యుండును.

అహమ్మదుషా పిమ్మట రాజ్యమునకు వచ్చినవాఁడు వాని జ్యేష్ఠ పుత్రుఁడైన అల్లావుద్దీన్. ఇతఁడు క్రీ.శ. ౧౪౩౫ మొదలు ౧౪౫౭ వఱకును బిదరు రాజధానిగా మహారాష్ట్ర కర్నాట భాగములతో సహా తెలంగాణమును గూడఁ గొంత భాగము పాలించెనని చెప్పవచ్చును. ఇతని సమకాలీనులు విజయనగర రాజులలో రెండవ దేవరాయ లనఁబడు ప్రౌఢ దేవరాయలును కళింగరాజులలోఁ గ్రొత్తగా గద్దె యెక్కిన కపిలేశ్వరుఁడును నై యున్నారు. ఈ అల్లావుద్దీన్ కపిలేశ్వర

గజపతితోఁ జెలిమి పాటించి ప్రౌఢ దేవరాయలతోఁ బోరాడుచుఁ దన కాలమును వెడలఁ బుచ్చినవాఁడు. ఇతని రాజ్యము పోతన కవియొక్క ౨౫ వ సంవత్సరపు వయస్సునఁ బ్రారంభించి యతని ౪౭ సంవత్సరముల వయస్సువఱకును సాగి నట్లున్నది. ఈ కాలమున హిందువుల కంత కష్టదశలు వచ్చి యుండవు. ఏలయన నీ యల్లావుద్దీన్ తన పూర్వరాజ్యమును గాపాడుకొనుచుఁ గ్రొత్తలకుఁ బోక పాలిత ప్రజలకు హితముగా రాజ్యముచేసినట్లు మహమ్మదీయ చరిత్రకారులు గూడ వ్రాయు చున్నారు. అప్పుడప్పు డితఁడు విజయనగర రాజులతోఁ బోరాడినను బ్రౌఢ దేవరాయని యుద్దామ విక్రమము క్రింద వీని బాణము సాగినదికాదు.

ఇట్టి యీ మంచికాలములోనే మన పోతన కవియొక్క భోగినీ దండక రచనయు భాగవత రచనా ప్రారంభమునై యుండవలెను. ఈతని కాశ్రయమైయున్న సర్వజ్ఞ సింగభూపా లుఁడు గూడ నీ కాలమునఁ గొంత స్వస్థతఁ జెంది పితృపైతామహమగు రాచకొండ రాజ్యమును బాలించుకొనుచుండ వచ్చును. అతఁడు బిదరు మహమ్మదీయ రాజ్యమున కంకి తుఁడో కాఁడో యూహించు నవకాశములులేవు.—

రాచకొండ రాజవంశ మిట్లుండ నాఱవతరమునఁ జీలి పోయిన మాదానాయని వంశజులు దేవరకొండను రాజ ధానిగాఁ జేసికొని తత్ప్రాంతములఁ బాలించుచుండిరి. వారిలో ౫ వ తరము రామచంద్రనాయఁడు 'గుల్బర్గా మహమ్మదీయ సుల్తాన్ ఫిరోజిషా నోడించిన కథ యిదివఱలో వ్రాసియుంటిని.

ఆ రామచంద్రనాయని తమ్ముఁడు కుమార మాదానాయఁడు. ఇతనికి ౧ సూరానాయఁడు ౨ కుమార వేదగిరి లేక చిన్న వేదగిరి నాయఁడు 3 లింగమనాయడు అనువారు ముగ్గురు పుత్రులు. వీరును సర్వజ్ఞ సింగమనాయని వలెనే తమ మూల పురుషుఁడైన బేతాళనాయనినుండి ౯ వ తరమువారు. కనుక నాతనికి జ్ఞాతి యన్నఁదమ్ములు గావలెను. వారిలో సూరా నాయనిగూర్చి వర్ణన పద్యమున్నది గాని చరిత్ర కుపయోగించు నంశములందు లేవు. అతని పెద్ద తమ్ముఁడగు వేదగిరికి 'కుమార' 'చిన్న' అను విశేషణము లున్నవి. అట్టి కుమార వేదగిరి. కొండ వీటిదుర్గము రాజధానిగా రెడ్డి రాజ్యమును బాలించిన కోమటి వేమునితో విరోధము పెంపొందించికొని యాతని తమ్ముఁడగు మాచారెడ్డిని యుద్ధమునఁ జంపెనట. అంతటఁ బోక వాని యాకృతిని దన తమ్మపడగలోఁ బొదిగించికొని యవమానపఱచు చుండెనట. ఇందులకుఁ గోపించి యా కోమటి వేమారెడ్డి కొండ వీఁటినుండి దండు వెడలివచ్చి యీ కుమార వేదగిరిని రణరంగ మునఁ జంపి వాని బొమ్మను దన తమ్మపడిగలోఁ బొదిగించి కొనెనట. తరువాత నా వేదగిరి తమ్ముఁడైన లింగమనాయఁడు తా నత్యంతము పిన్నవయసువాఁడైనను, బంధుకోటి నెల్లఁ గూర్చుకొని దాడి వెడలి యా కొండవీఁటి కోమటి వేముని యుద్ధమునఁ జంపి వాని ప్రతిమను దన తమ్మపడిగలోఁ జెక్కించెనట. ఇది యప్పటి రాజకుటుంబములవారి మర్యాద. కోమటి వేమారెడ్డి క్రీ.శ. ౧౪౦౦ మొదలు ౧౪౨౦ వఱకును గొండవీఁటిని బాలించిన రెడ్డిరాజు. వానిని జంపిన లింగమ

నాయఁ డప్పటికి రమారమి ౬౦ సంవత్సరములకంటె నధిక వయస్కుఁడు గాఁడనుకొన్న నాతని జ్ఞాతిసోదరుఁడగు భోగినీ దండక కృతిపతికూడ నంతే యీఁడువాఁడు గావలెను.

లింగమనాయఁడు తరువాతఁ బ్రౌఢ దేవరాయనికి ముఖ్యభృత్యుఁడై యాతని పక్షమున ననేక యుద్ధములుచేసి బహు విజయములు సాధించినట్లు మన మూహింపవలసి యున్నది. ప్రౌఢ దేవరాయలు విజయనగర సింహాసనమును క్రీ.శ. ౧౪౨౩ లో నధిరోహించి ౧౪౪౬ వఱకును రాజ్యము చేసిన రాజాధిరాజు ఈతని జీవితకాలములో బిదరు సుల్తానగు అహమ్మదుషా కొంత పరాక్రమించి ౧౪౨౯ ప్రాంతమున నాతనిచే నోడింపఁబడి పలాయితుఁడై రాజధాని చేరెనట. తరువాత రాయలు పూర్వాంధ్రముపై దండువెడలి గజపతి యగు నాల్మడి భానుదేవుఁ డాక్రమించియున్న రాజమహేంద్ర వర రాజ్యమును జయించి దానిని రెడ్డిరాజులకు వశముచేసి సింహాచలము వఱకును విజయయాత్ర సలిపిఁ జయఘోషము లతో వెడలిపోయెనట. యీ సందర్భమునందే యీ రాయలను దన పరాక్రమముచే మెప్పించి లింగమనాయఁడు గౌరవమంది యుండవలెను.

## పోతన కాలపు రాజులు

క్రీ.శ. బిదరు తురక రాజులు
౧౪౨౨–౧౪౩౫ బిదరు మహమ్మదీయసుల్తాను అహమ్మదుషా.
౧౪౩౫–౧౪౫౭ అహమ్మదుషా కుమారుఁడు అల్లావుద్దీనుషా – (బిదరు)

| | |
|---|---|
| విజయనగర హిందూ రాజులు | ౧౪౨౩–౧౪౪౬ విజయనగర సమ్రాట్టు ప్రౌఢ దేవరాయలు.<br>౧౪౪౬–౧౪౪౭ ప్రౌఢ దేవరాయల తమ్ముఁడు రెండవ విజయరాయలు<br>౧౪౪౭–౧౪౬౫ మల్లికార్జునరాయలు. (ఇతఁడు ప్రౌఢ దేవరాయల పుత్రుడు). |
| ఒరిస్సా లేక కళింగము రాజు | ౧౪౩౫–౧౪౭౦ కపిలేశ్వర గజపతి. (కళింగ దేశపు క్రొత్తరాజు–రాజధాని కటకము) |
| రాచకొండ వెలమ రాజులు | ౧౪౨౫–౧౪౪౫ సర్వజ్ఞసింగభూపాలుడు (భోగినీ దండక కృతిపతి.) |
| దేవరకొండ రాజు | ౧౪౨౦–౧౪౫౦ లింగమనాయడు (కొండవీఁటి కోమటివేమారెడ్డిని జంపిన వాఁడు. ప్రౌఢ దేవరాయుని సేనాని.) |

అల్లావుద్దీన్‌షా ౧౪౫౮ లో మరణింపఁగా వాని కొడుకగు హుమాయూన్‌షా అనువాఁడు రాజై గజపతులతోడి పూర్వసంధిని సైతము పాటింపక దేవరకొండ హిందూ రాజ్యము (లింగమనాయని రాజ్యము) పైకి దాడి వెడలెను. అప్పుడా లింగమనాయని యిలాకావారు ఒరిస్సా రాజగు కపిలేశ్వరుని సాహాయ్యముఁగోరిరి. అందుల కతఁ డంగీకరించి వారికి సహాయ్యము చేయవచ్చెను. ఈ విషయములు బురాన్ అస్సీరు

అను మహమ్మదీయ చరిత్ర తెలుపుచున్నది. ఈ హుమాయూన్ ౧౪౬౧ వఱకును ౪ సంవత్సరములు మాత్రమే రాజ్యముచేసి గతించెను. వాని తరువాత నిజాంషాహా అను బాలుఁడు రాజై ౧౪౬౩ లో మరణించెను. తరువాతి బిదరుసుల్తాను II మహమ్మదుషా. వీని కాలమునవఱకును హిందూరాజులతో మరల వీరికి యుద్ధము పొసఁగినట్లులేదు.

ఒరంగల్లులోని యొక శిలాసనమును బట్టి ప్రమాది సంవత్సరము మాఘశుక్ల ౧౦ నాఁడు గజపతి కపిలేంద్రమహారాయల కుమారుఁడు రాచ్చిదేవమహాపాత్రుఁడు ఒరంగలు కోటను బట్టుకొన్నట్లు తెలియుచున్నది. ఈ ప్రమాది సంవత్సరము క్రీ.శ. ౧౪౬౦ కి సరియైనది కావలెను. దీనినిబట్టి యిది బిదరు హుమాయూన్షా రాజ్యకాలమే యగుచున్నది. ఈ కాలమునఁ దెలంగాణాలోని కొంత భాగమైన ఒరిస్సా రాజగు కపిలేశ్వరునకు వశమయ్యెననియు నిచ్చటి వెలమరాజు లాతని సాహాయ్యముపొంది తురకల నెదిరించిరనియును దెలియనచ్చుచున్నది. మన నిర్ణయము ప్రకారము బమ్మెర పోతన్న యీ కాలమునకు (౧౪౬౦ కి) ౫౦ సంవత్సరముల వయస్సువాఁడు మాత్రమె. ఇదే యితని భాగవత రచనాకాలము. ౧౪౬౩ లో II మహమ్మదుషా రాజ్యమునకు వచ్చిన తరువాతనే తెలంగాణా మహమ్మదీయులకు వశపడినది. అప్పటినుండియె హిందూ రాజులకును వారి రాజ్యములందున్న హిందూ ప్రజలకును దుర్దశ ప్రారంభమైనది. ఈ రెండవ మహమ్మదుషా రాజులనే కాక హిందూ మతమునకు ముఖ్యులైన బ్రాహ్మణ జాతివారి

ననేకులను గొండపల్లి కోటద్వారమున నతి క్రూరముగాఁ జంపించినట్లును చరిత్రకారులు వ్రాయుచున్నారు. పోతన్న ౧౪౭౦ నాటికి ౬౦ సంవత్సరములవాఁడే కనుకను ప్రసిద్ధ బ్రాహ్మణుఁడు కనుకను నీ తురక సుల్తాను బాధలకుఁ గొంతి యైన గుఱియైయుండెనేమో. అదే యొకవేళ భాగవత వైకల్యాదులకు గారణము గావచ్చును. ౧౪౭౦ ప్రాంతము పోతన యొక్క యంత్యకాలమైనను గావచ్చును. తరువాత నీతని వంశస్థులు పరదేశములకుఁ బరుగెత్తుట సంభవించియుండును. అట్టియెడ భాగవత గ్రంథ రక్షణము నిరాలంబమైయుండును. ఇంతేకాని సర్వజ్ఞసింగభూపతి యీ భాగవత కృతిపతిత్వము నభిలషించి విఫలమనోరథుఁడై దీని వినాశమునకుఁ గారకుఁ డయ్యెనను వాఁడుక యెంత మాత్రము సమంజసముగా నుండ లేదు.

ఖర సంవత్సర ఫాల్గుణ భారతిలో - (శ్రీ) కో. రాఘవాచారిగారు చిన్న వ్యాసమును 'దెందుకూరి శిథిల శిల్ప సంపద' అను శీర్షికతోఁ బ్రకటించియున్నారు.

దెందుకూరు గ్రామ మీవల నిర్మింపఁ బడినదట. తత్పూర్వ మా ప్రదేశమున సారంగ పట్టణమను నొక పెద్ద గ్రామ మున్నట్లు జనశ్రుతి గలదట - (దెందుకూరు గ్రామము తెలంగాణాలోని కమ్మమెట్టు జిల్లా మధిర తాలూకాలో నున్నది.) తరువాతి వారి వాక్యము లివి.

"బెందుకూరు గ్రామములో ఆంజనేయస్వామి దేవాలయ మొకటి గలదు. ఈ ఆలయ ప్రాంగణములో ఒక సత్రము నిర్మించు నుద్దేశముతో శ్రీమతి కపిలవాయి సీతమ్మ గారు ఆలయపు దక్షిణభాగములో పునాదులు త్రవ్వించు చుండగా రెండున్నర (2½) గజముల లోతున ఒకదానిపై నొకటి పేర్చియున్న విగ్రహములు (౨౧) ఇరువదియొక్కటి బైటఁబడినవి."

"పైనఁజెప్పిన (ఆంజనేయస్వామి) ఆలయములో ఇంతకు పూర్వము ఈ రీతిగనే ఆంజనేయ విగ్రహము, రెండు శివ లింగములు, పూర్వ దేవాలయమునకు సంబంధించిన పునాదులు బయటఁబడినవట" ఈ విశేషములన్నియు వ్రాసి తుదకు కాకతీయుల పిమ్మట వచ్చిన రెడ్డిరాజుల కాలములో శ్రీరంగము నుండి ఉత్తరాదికి వచ్చిన వైష్ణవ స్వాముల బోధవల్ల వైష్ణవాలయములు గూడ కట్టించినట్లు కోరుకొండవంటి వైష్ణవ క్షేత్రములు సాక్ష్యమిచ్చుచున్నవి. అనియు ఈ విగ్రహములు పదునైదవ శతాబ్దము నాటివై యుండునని యూహించుచున్నా ననియుఁ దెలిపి – ఆ వ్యాస రచయితగారు తుదకు.

"విగ్రహము లన్నియు ఒకదానిపై నొకటి పేర్చి భూస్థాపితము చేయఁబడియుండుటనుబట్టి ఏ భామినీ సుల్తాను కాలములోనో ఇవి నాశనము చేయఁబడునను భయమువలన భక్తులు వీఁటిని భూగర్భమున దాచి ప్రాణరక్షణకు దక్షిణాదికి తరలియుందు రేమో యని యూహింపవచ్చును" అని తమ

యూహను ప్రకటించినారు – కావునఁ బోతన భాగవత భూస్థాపనాదికమునకును నిట్టిదే కారణ మేల కాఁగూడదు ?

పోతన వరాహావతార ఘట్టము వ్రాయుచుండగా రాజసేనలు భాగవతమును హరింపవచ్చినట్లును, వారిని వరాహరూపుఁడగు విష్ణుదేవుఁడు సంహరించినట్లును నొక కథ వ్యాప్తిలో నున్నది గదా! తురకలకు వరాహము సరిపడదు. ఆ వరాహమే తురక సేనల నాశనమునకుఁ గారణమయ్యెనని యొక కల్పన భాగవత రచనా సందర్భమున వాడుకలోనికి వచ్చియుండునన్న నది కొంత సంగతముగా నున్నది. ఈ కాలమువఱకును (౧౪౭౦ వఱకు) సర్వజ్ఞసింగభూపాలుఁ డుండెనో లేదో – ఉన్నను జాల వృద్ధుఁడై యుండవలె.

ఈ సింగభూపతిని గూర్చి కొఱవి గోపరాజు రచించిన సింహాసనద్వాత్రింశిక వలనఁ గూడఁ గొంత దెలియవచ్చుచున్నది. ఆ కావ్యపీఠికలో గోపరాజు తన వంశమును జెప్పుచుఁ దన పితామహుఁడైన గోపయ్యకు జ్యేష్ఠ భ్రాతృ పుత్రులగు బాచిరాజు, సింగనలను నిద్దరును అనపోతసింగయకు మంత్రులుగా నుండినట్లు

క॥ ఘను లగ్రజులకు నీఁడై
వనములుఁ గ్రతువులును గృతులు వడి నిల్పిరి బా
చనయును సింగనయును దగి
రేచ పోత కుమారసింగయకు మంత్రులనన్

అను పద్యమునఁ జెప్పియున్నాడు.

ఈ అనపోత కుమారసింగయ భోగినీ దండక కృతిపతియే కాని యన్యుఁడుగాఁడు. భోగినీ దండకములో "కుమారాన్న పోతావనీనాథసూనుఁ" అని కదా పోతన్న తన కృతి నాయకుఁడును గథానాయకుఁడునైన సర్వజ్ఞసింగభూపాలుని వర్ణించినది. గోపరాజు గృహనామముగాఁ బరిణమించిన కొఱవి గ్రామము వరంగలు జిల్లాలోఁ దత్సన్నిహితముగనే యున్నది. అట్టి కొఱవి గ్రామము తన పూర్వుల నివాసముగాఁ గల గోపరాజుకుఁ గుమారుఁడును. కవి గోపరాజుకుఁ దండ్రియునైన కసవరాజును గూర్చి

గీ. వేముఁగల్లు జన్మభూమిగాఁ బేరిగియు
దీవు లెల్ల మాట దీటుపఱచి
హారి పక్షైక బుద్ధి హారిత గోత్రాంబుధి
రాజనంగఁ గసవరాజు మించె

అను పద్యమును దత్పుత్రుఁడు చెప్పినందున, కవి గోపరాజు తండ్రియగు కసవరాజు వేముఁగల్లు గ్రామమునఁ బుట్టినట్లు దెలియుచున్నది. మఱియుఁ దద్రాజగు రాణామల్లన నరేంద్రునకు మంత్రియై గురువై యుండినట్లుగూడఁ దరువాతి వచనములు తెలుపుచున్నవి. ఈ వేముఁగల్లు సైతము వరంగలు జిల్లాలోఁ గొఱవి గ్రామమునకు సమీపముననే యున్నది.

ఈ కవి గోపరాజుయొక్క తండ్రికి జ్ఞాతి సోదరులగు బాచిరాజును, సింగనయు భోగినీ దండక కృతిపతికి మంత్రులు గావున – భోగినీ దండక కృతి కర్తయగు మన బమ్మెర పోతన

యీ గోపరాజకవికిఁ గొంచెము ముందు వాని తండ్రికి సమ
కాలీనుఁడై యుండెననినిశ్చితము చెప్పఁబడియున్నది. గోపరాజు
కాలము దెలియుటకుఁ బ్రత్యేక సాధనము లెవ్వియు లేకున్నను
నతని పూర్వకవి వర్ణన రూపముగు.

చ॥ అనఘు హుళక్కి భాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరనా।
ఘను ఘను నాగరాజుఁ గవిసోముని గొక్కన సోమయాజి జేఁజే।
జేన కవి రంగనాథు సుచిత్రజ్ఞుని నెఱ్ఱన నాచిరాజు సో
మున నమరేశ్వరుం దలతు మత్కుల చంద్రుల సత్కవీంద్రులన్.

అను పద్యమునుబట్టి పిల్లలమఱ్ఱి పిన్నవీరన్నకంటె నీతఁ
డీవలివాఁడని స్పష్టపడుచున్నది. పై పద్యములోని కవులందఱి
కంటెఁ బిల్లలమఱ్ఱి పిన్న వీరన్న యీవలివాఁడు. కనుక గోప
రాజు పితృవ్యులు (పిన తండ్రులు) భోగినీ దండక కృతిపతికి
మంత్రులగుటచే – వారును బోతనయు సమకాలికులని తేలి
నందునను, గోపరాజు వర్ణనలో వచ్చిన పిల్లలమఱ్ఱి పిన వీర
భద్రుఁడు సాళువగుండ నరసింగరాజు నాస్థానకవియై యతని
కంకితముగా జైమిని భారతమును రచించినవాఁడైనందునను,
బోతన వీరభద్ర కవులు గూడ సమకాలికులను నవకాశ మేర్పడు
చున్నది.

పిల్లలమఱ్ఱి పిన వీరభద్రునిచేఁ గృతిఁ బొందిన సాళ్వ
నరసింగరాజు క్రీ.శ. ౧౪౫౬ నుండి విజయనగరసామ్రాజ్యము
నకు సామంతుఁడై చంద్రగిరి దుర్గమునందుండి తత్ప్రాంతమును
బాలించుచుండెను. కాని ౧౪౮౬ లో మల్లికార్జున రాయలను

జంపి యతని తమ్ముఁడు రెండవ విరూపాక్షరాయలు విజయనగర సామ్రాజ్యమును హైనసముచేసికొనుటతో సామంతుల కాతనియం దసహ్యాభావ ముదయించెను కనుక సాళ్వ నరసింగ రాజున్నైతము వారిలో నొకఁడై విరూపాక్షునెడ విరక్తుఁడై యే ర్పడెను. తరువాతఁ గ్రీస్తుశకము ౧౪౭౦ లో గజపతియైన కపిలేశ్వరుఁడు మరణింప నాతఁడు కళింగుల దుర్నియములకుఁ బ్రతిక్రియ మాత్రము చేయుచు సామ్రాజ్యమునెడ నుపేక్ష నహించియుండెను. కడ కతఁడు విరూపాక్షుని బదభ్రష్టుం గావించి విజయనగర సింహాసనము నాక్రమించెను. ఈకాలము క్రీ.శ. ౧౪౮౦ ప్రాంతము. ఈ యాక్రమణము జరిగిన తరువాతనే పినవీరభద్రుఁ డతని కంకితముగా జైమిని భారతమును రచించి యున్నాఁడు. అందు—

గీ॥ తలఁచి మూర్ధాభిషిక్తుఁడై ధరణిపతులు
గొల్వ నసహాయ శూరతవెలసి దాన
శక్తి నవతార మెత్తిన శౌరి గాక
క్షితిప మాత్రుండె సాళ్వ నృసింహవిభుఁడు.

అనియూ కవి చెప్పినందునను

సీ॥ గీ॥ సత్కవుల గ్రుప్పు డుల్చువసంతవేళ
రాయమీసర గండ ధరా వరాహ
విజయ విఖ్యాత గండ భూ విభు నృసింహ
సాళ్వ భూముని బిరుదైన సాళువంబు

అను సీస గీతమున నా నృసింహ సార్వభౌమత్వమును గవి స్పష్టముగా వర్ణించినందునను—జైమిని భారతము ౧౪౭౦ కి తరువాత రచింపఁబడినట్లు మనము గ్రహింపవలసియున్నది. కావున నీ కవిని గవులస్తుతిలోఁ జేర్చుకొన్న కొఱవి గోపరాజు ౧౪౩౦–౧౫౦౦ ప్రాంతమువాఁడు గాఁజాలును. ఇతని పితృవ్యుల కాలమువాఁడైన బమ్మెర పోతన ౧౪౬౦ ప్రాంతమునుండి భాగవత రచన గావించుచుండె ననుటలో నే దోషమును గానరాదు. కనుక భాగవతరచన నా చెప్పినట్లు ౧౪౬౦–౧౪౭౦ ల నడిమి కాలముననే కాఁదగియున్నది.



# మూడవ ప్రకరణము

## పోతన వంశాదికము

పోతన్న కౌండిన్య సగోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. ఇతఁడు దన వంశమును వీరభద్రవిజయమున విరివిగా వర్ణించుకొనెను. భాగవతమునందదియే సంగ్రహింపఁబడినది. రెంటికి నే విషయమునను భేదము లేదు. కాని యందు శాఖాంతర పురుషుల పేర్లు మాత్రమే పోతన్న చెప్పియుండలేదు.

తండ్రియైన కేసన్నను గూర్చి

ఉ॥ భూసుర వంద్యునిన్ సుగుణ భూషణు నాశ్రిత కల్పవృక్షముం
దాసజనప్రసన్ను శివతత్త్వము నొరథ కాతుకోన్నతుం
గేసన మంత్రి సత్యనిధిఁ గీర్తివిశాలుఁ జిరాయు రున్నతుం
జేసి యుమామహేశ్వరులు చెన్నుఁగఁ గాతురుగాక సత్కృపన్
వీర. పీఠిక ౩౮

సీ॥ ఎల్లన యతనికి నిల్లాలు మాచమ వారి పుత్రుఁడు వంశవర్ధనుండు.

గీ॥ లలితమూర్తి బహు కళానిధి కేసన
దానమాన నీతిధనుఁడు ఘనుడు
దనకు లక్కమాంబ ధర్మగేహినిగాగ
మనియె శైవశాస్త్ర మతముగనియె.

భాగ. పీఠిక.

అని వర్ణించి యున్నాఁడు.

తల్లిని గూర్చి—

క॥ మంచి గుణంబుల నీతఁడు
మంచిగదా! మంచి పేరు మహిఁదగు ననఁగా
నంచిత వితరణ ఖనియై
మించిన తేజమ్ముతోడ మెఱసె ధరిత్రిన్.

ఇది తన మాతామహుని గూర్చి పోతన చెప్పిన పద్యము. తరువాత—

ఉ॥ అట్టి ఘనుండు మంచికి దయాగుణ ధీమణి మాచమాంబకున్
బుట్టిన లక్కికన్య యనఁ బొల్పగు గోపన కూర్మి చెల్లెలిన్
నెట్టనఁ బెండ్లి యాఁడె మహనీయుఁడు కేసన మంత్రి శ్రీసతిన్
దట్టపు వేడ్కఁ గేశవుఁడు దాను వరించిన భంగిఁ బొంగుచున్.

ఉ॥ పావన గంగ, భోగశచి, భాగ్యపుగౌరి, గభీరభూమి. సం
భావన కుంతి, రూపగుణ భారతి, సంపద లక్ష్మిదేవి, సం
సేవిత సంజ్ఞ, నిశ్చల విశేష యరుంధతి, యైన లక్కమాఁ
గేవల కన్యయే తలపఁ గీర్తన సేయఁదగున్ ధరాస్థలిన్

వీర. ౩౫-౩౬-౩౭.

క॥ నడవదు నిలయము వెలువడి
దడవదు పరపురుషు గుణము దన పతి నుడువున్
గడవదు వితరణ కరుణలు
విడువదు లక్కాంబ విబుధ విసరము పొగడన్.

ఉ॥ మానిను లీడుగారు బహు మాననివారిత దీన మాన స
మ్లానికి, దానధర్మ మతి గౌరవ మంజులతా గభీరతా
స్థానికి, ముద్దసానికి, సదాశివ పాదయుగార్చనాను కం
పానయ వాగ్భవానికిని, బమ్మెర పోతయ లక్కసానికిన్.
—భాగవత పీఠిక.

అని వర్ణించియున్నాఁడు.

పోతన్నకుఁ దన యన్నయైన తిప్పయ యందును భక్తి యధికము.

క॥ ఆ దంపతులకు సంతత
మోదిత చిత్తులకు మిథునముఖ్యులకు దయా
పాదిత గుణులకు శంకర
పాదయుగాంభోజ భక్తి పారీణులకున్.

అని తన తలిదండ్రులఁ బొగడి—అన్నను గూర్చి

శా॥ సారాచారుఁడు, కాంతి వైభవగతిన్ సంపూర్ణ చంద్రుండు, భూ
దారాహీంద్ర సమానదత్తుఁడు, సదాధర్మాకరుం, డర్థి మం
దారుం, డంచిత రూపరేఖలను గందర్పుండు, భూయోయశః
శ్రీ రమ్యుం, డగు తిప్పనార్యుఁడు జనించెన్ వంశవర్ధిష్ణుఁడై
వ॥ తదనుజుండనై యేను జన్మించితి.
వీర. పీఠిక ౩౯-౪౦.

క॥ ఆ మిథునమునకుఁ బుట్టితి
మే మిరువుర మగ్రజాతుఁ డీశ్వరసేవా
కాముఁడు తిప్పయ, పోతయ
నామవ్యక్తుండ, సాధునయయుక్తుండన్
—భాగ. పీఠిక.

ఇంతవఱకుఁ బోతన గ్రంథములనుండి తెలిసిన యంశములు.

దాక్షాయణీ పరిణయమను కావ్యమును కేసన, మల్లన, అను కవులు రచించి గురిజాల మల్లన సోమయాజి కంకితము గావించిరి. అందలి కవిస్తుతి.

చ॥ నెఱి గుఱి గల్గు నన్నయను, మనీషిని దిక్కన, శంభుదాసునిన్,
బరువడి మత్పితామహుని బమ్మెర పోతన భాస్కరాహ్వయున్,
వరకవి సార్వభౌముని, నవారిత భక్తి నుతింతు నెప్పుడున్
గురు కరుణాఢ్యు లంధ్రకవి కుంజరులం దగు భూతి శోభిలన్

కృతిపతియగు మల్లన సోమయాజి తమ్ముఁ గూర్చి పలికినట్లు—

సీ॥ శ్రీరామలింగాంఘ్రి సేవావరప్రౌఢిఁ గవితాచమత్కృతిఁ గాంచువారి
నప్పలమ్మయును, వీరాంబయుఁ బ్రౌఢ సరస్వతికిని గన్న ప్రజ్ఞవారి
కౌండిన్యగోత్ర విఖ్యాతి బమ్మెర భవ్య వంశాఢ్యులై సిరివఱలువారి
నివటూరి ముక్తి నాగేశ సద్గురుభక్తి నాదిమ శైవులైనట్టివారి.

గీ॥ కేసకవి, మల్లకవి నామకీర్తిపరుల
మమ్ముఁ బిలిపించి మన్నించి మదిఁదలంచి
ఘనత నుచితాసనంబున నునిచి వేడ్క
వినయ నయ వాక్యములచేత నెనయఁ బలికె.

అని చెప్పుకొనియున్నారు. ఈ పద్యములనుబట్టి పోతనామాత్యునకుఁ బ్రౌఢ సరస్వతి యను పుత్రుఁ డున్నట్లును,

అతనికి ౧ అప్పలమ్మ, ౨ వీరమ్మ, అను భార్య లిద్దరున్నట్లును, అం దప్పలమ్మకుఁ గేసన్నయు, వీరమ్మకు మల్లనయుఁ బుట్టినట్లును దెలియవచ్చుచున్నది – వీరికి ఎల్లమ్మ యను నొక సోదరి యున్నట్లును నామెను అజ్జరపు పేరలింగమను కవి పెండ్లాడినట్లును ఆ కవి రచించిన ఒడయనంబి విలాస మను కావ్యములోని యీ క్రింది

ఉ॥ బమ్మెర వంశమందునను బ్రౌఢ సరస్వతి పద్దుగాంచి తా
నెమ్మె దలిర్పఁ గేసన కవీశ్వరు లప్పమనామ సాధ్వియం
దిమ్మహిఁ గూర్మిఁ గన్న సుత యెల్లమ యందును బేరయాఖ్యుఁడన్
సమ్మతిఁ గంటి వీరనరసమ్మను, గంగన మంత్రియుగ్మమున్.

ఈ పేరలింగ కవి తన కేఁడవ తరము మూలపురుషుఁడైన కొండన్న గజపతి రాజుచేఁ దన విద్యావిశేషములకు బహుమానముగా: "గౌతమీ। తీరక్షోణిని నజ్జరంబనఁగఁ దాఁ దెచ్చెన్ మహా గ్రామమున్"–అని అజ్జరమను నగ్రహారమును గోదావరీ తీరమున సంపాదించెనని చెప్పుకొనియున్నాడు.

ఇతఁ డాపస్తంబ సూత్రుఁడు. భారద్వాజ గోత్రుడు కొండన భావమాంబల పుత్రుఁడు నని తద్గ్రంథమువలనఁ దెలియుచున్నట్లు శ్రీ కీ. శే. వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు.

దాక్షాయణీ పరిణయకర్తలు పోతన్న తమ పితామహుఁడనియుఁ దమ తండ్రి పేరు ప్రౌఢ సరస్వతి యనియు మాత్రమే చెప్పియున్నారు. ప్రౌఢసరస్వతి యనునది బిరుదనామ మని

దాని స్వరూపమును బట్టియే తెలియుచున్నది. మఱియుఁ దమ తండ్రి కిద్దరు భార్యలనియు వారిలో నొకామె పేరు అప్పలమ్మ, మఱియొకామె పేరు వీరమ్మ యనిసైతము వారు దెలియఁ జేసిరి.

అజ్జరపుఁ బేరలింగ కవి తన కావ్యములోఁ జెప్పికొని నట్లాతని మామగారు ప్రౌఢ సరస్వతి యను పద్దు (బిరుదు) గాంచిన కేసన కవీశ్వరుఁడు. అతడు అప్పమనామసాధ్వియందుఁ గాంచిన బిడ్డ యెల్లమ్మ ఆ పేరలింగము భార్య.

రెండు ప్రత్యేక గ్రంథములవలనఁ దేలిన యీ యంశము లనుబట్టి – పోతనకుఁ బ్రౌఢ సరస్వతి యను బిరుదుగల కేసన యను కుమారుఁ డున్నాఁడనియు నాతని యిద్దరు భార్యలలో నొకామె పే రప్పలమ్మ లేక అప్పమ్మ యనియు రెండవ యామె వీరమ్మ యనియు అప్పలమ్మయం దా ప్రౌఢ సరస్వతికిఁ గేసన్నయుఁ బేరలింగము భార్యయగు నెల్లమ్మయు జనించి రనియు వీరమ్మయందు, మల్లన కవి యుదయించె ననియుఁ దరు వాత నీ కేసన మల్లనలు కవులై దాక్షాయణీ పరిణయమును రచించిరనియు వారి చెల్లెలగు నెల్లమ్మనుఁ బెండ్లాఁడిన అజ్జరపు పేరలింగము గూడఁ గవియై యొడయనంబి విలాసమను శైవ కథను రచించెననియుఁ దెలియుచున్నది. ఇంతేకాక యీ యెల్లమ్మకు వీరనరసమ్మ, గంగన మంత్రి యనువారు సంతాన మని సైతము దెలియుచున్నది.

# పోతస వంశము — కౌండిన్యస గోత్రమునందు.

మల్లయ్య
|
భీమన్న
|
అన్నయ మంత్రి భార్య గౌరమాంబ
సోమన్న భా॥ మల్లమ్మ

(౧) కేచన్న (౨) అన్నయ్య (౩) ఎల్లన్న భా॥ మాచాంబ (౪) అయ్యలన్న (౫) మాచయ్య

(౩) ఎల్లన్న:
(౧) కేసన్న భా॥ లక్కాంబ (౨) మాధవుఁడు (౩) ఇమ్మడి

(౧) కేసన్న:
(౧) తిప్పన్న (౨) పోతన్న - భాగవతాదికర్త.

పోతన్న:
కేసన్న - ప్రౌఢసరస్వతి బిరుదాంకితుఁడు

జ్యేష్ఠ భా॥ అప్పలమ్మయందు | కనిష్ఠ భా॥ వీరమ్మయందు

(I) దాక్షాయణీ పరిణయకర్త (౧) కేసన్న (౨) ఎల్లమ్మ ......... (౩) మల్లన్న (II) దాక్షాయణీ పరిణయకర్త

ఎల్లమ్మ: ఈమె అజ్జరపు పేరలింగము భార్య
|
వీరనరసమ్మ - గంగన్న

ఇట్లు పోతన పిమ్మటఁ గూడ దద్వంశజులు రెండు మూఁడు తరములవారు తెలియబడుచున్నందునను, వారి యౌన్నత్య మూహింపఁదగు నవకాశములు గనుపించుచున్నందునను పోతన వంశాతిశయ మున్నేయ మగుచున్నది.

అయితే పోతన్న భార్య పేరుగాని యామె పుట్టినింటి వారి విశేషములుగాని తెలియవచ్చుటలేదు. పోతన శ్రీనాథ కవియొక్క యక్కనో చెల్లెలినో పెండ్లాడెననియు నామెకు మల్లన్నయను కుమారుఁ డుండెననియుఁ జెప్పు లోకగాథలు పూర్తిగాఁ గల్పితములని త్రోసివేయకతప్పదు. ఏలయన శ్రీనాథ కవి పోతనకంటె ౪౦ సంవత్సరములైన పెద్దవాఁడుగా నూహింపఁ దగియున్నాఁడు గదా! ఈ విషయము వెనుకటి ప్రకరణముననే నిరూపించియుంటిమి. తనకంటె ౪౦ సం॥లు పిన్నవయసువాని కీయఁ దగిన చెల్లెలు శ్రీనాథున కుండెననుట హాస్యాస్పదము. ఒకవేళ శ్రీనాథునకు బిడ్డయుండి యా శ్రీనాథ పోతనలకు సంబంధబాంధవ్యములు కుదురఁ గల యవకాశ మున్నచోఁ బోతన శ్రీనాథున కల్లుఁడు గాఁదగి యుండును. కాని యట్టి యవకాశము లెవ్వియు నెందును గానవచ్చుటలేదు.

శ్రీనాథుఁడు పాకనాఁటి నియోగి. అని భీమఖండ కృతి పతి యతనితో – 'పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు, అన్న వాక్యములనుబట్టి తెలియుచున్నది. పోతనామాత్యుఁడు నేఁటి తద్వంశజుల వాడుక ప్రకార మాఱువేల నియోగి కావచ్చును. ఈ కారణమునను వీరికి సంబంధబాంధవము లుండఁజాలవు.'

ఇఁక నీ విషయమును వదలి పోతన విద్యాభ్యాసమును గూర్చి విచారింతము.

భాగవత ప్రథమ ముద్రణ పీఠికలోనున్న యీ క్రింది వాక్యముల యాథార్థ్యము దొలుత చర్చనీయము. అందు—

"ఇమ్మహాత్ముఁడు (పోతన) బాల్యంబునందు గోసంరక్షణార్థంబుగా స్వగ్రామంబగు నేకశిలానగరంబునకు సన్నికృష్ట పర్వతాగ్రంబున సంచరించు సమయంబున నచ్చట నతని పూర్వజన్మ సుకృత పరిపాకాతిశయంబునం జిదానంద యోగీంద్రుం డను నొక్క ఋషిశ్రేష్ఠుండతనికి దృగ్గోచరుం డయ్యె. నంత నా పోతనామాత్యుం డమ్మహాత్మునిం గాంచి యతని చెంతకుంజని యత్యంత భయభక్తులచే నవనత శరీరుండై యభివందనం బొనర్చి శరణుసొచ్చితినని పలుక నాత పోధనుండు బాలుండగు పోతనామాత్యునియం దవ్యాజ కరుణ నుంచి శ్రీరామ మంత్రరాజం బనుగ్రహించి తదనుష్ఠాన క్రమం బశేషంబుఁ దెలిపి కృతార్థుండవు కమ్మని పలికి యంతర్ధానుం డయ్యె. (తరువాతి వర్ణనము. పోతన కమ్మంత్ర ప్రభావమునఁ గలిగిన విశేషములనుగూర్చి) ఆ పిమ్మట "శుక్లపక్ష క్షపాకరుని కరణి స్వతపో మహిమచేఁ గ్రమముగా వృద్ధినొంది విధూతాఖిల భవబంధ బంధురుండై ఋషివర్యునిం బోలి లోకంబున వినుతికెక్కి యుండె. ఇట్లుండ నిమ్మహాత్మునికి శ్రీరామ ప్రసాదంబున ననన్యాదృశాన వద్య కవిత్వ విద్యావ్యాప్తి కలుగుటం జేసి — (ఇత్యాది)."

పోతన బాలుఁడై యుండి యేకశిలానగర సన్నిహిత పర్వతాగ్రంబున గోవులఁ గాచుచుండుటయు నాతనికిఁ జిదానందయోగి యను పేరుగల మహర్షి కనుపించి రామమంత్రం బుపదేశించుటయు నిక్కమగునేని - యీ చిదానందయోగి ప్రశంస యించుకయుఁ బోతన గ్రంథములలోఁ గానరాదేందుకు? అతఁడు తన పిన్నతనములోఁ దాను వీరభద్రవిజయమును రచించుచున్నట్లు - "పిన్నవాఁడననియుఁ బెక్కు సత్కృతులను విననివాఁడననియు వెఱపుమాను" అను గురువాక్యముల మూలమునఁ దెలుపుకొనియున్నాఁడు గదా! అట్టియెడ నాతని కా జంకు దీర్చినది శైవమతగురు పరంపరలోని సోమ నారాధ్యుఁడుగాని రామమంత్రోపదేశపరుఁడైన చిదానందయోగి కాదే! ఈ సోమనారాధ్యుని గూర్చి వీరభద్రవిజయములోఁ బోతన తన పీఠికయం దద్భుతముగా వర్ణించియున్నాఁడు.

> "పరమ భద్రాసన ప్రముఖ మార్గంబుల
> యోగీంద్రు లితఁ డాదియోగి యనఁగ.

ఇత్యాదిగా సీసపాద చతుష్టయముచే నాతనిని వర్ణించి తరువాత గీతపాదముల నిట్లు చెప్పుచున్నాఁడు.

> గీ॥ వెలయు శంభుమూర్తి వీరమాహేశ్వరా
> చార విభుఁడు భక్తి పారగుండు
> అనఘుఁడివ్వటూరి యారాధ్యచంద్రుండు
> సోమనాథ సముఁడు సోమగురుఁడు.

తన గురువు సోమగురుఁడట (చిదానందయోగి కాదు) అతఁడు వీరమాహేశ్వరాచార విభుఁడట అనగా బసవరాజుచేఁ గన్నడ దేశమునను బాల్కురికి సోమనాథునిచేఁ దెలుగు దేశమునను వ్యాపింపఁ జేయఁబడిన వీరశైవాచారమునందు వినిష్ఠితుఁడట (రామమంత్ర పరాయణుఁడు కాదు) ఇంతేకాక యతఁడు సోమనాథు (పాల్కురికి సోమనాథు)నితో సమానుఁడట. (ఏ వైష్ణవ గురువులతోడనో సమానుఁడుగాదు). అట్టి సోమగురువు పోతన్నకు "బిన్నవాఁడను బెక్కు సత్కృతుల విని యెఱుఁగను. కావ్యరచన కెట్లుత్సహింతునని బెదరకు. ఇదిగో చూడు.

గీ॥ మత్ప్రసాద దివ్యమహిమచే నింతైనఁ
గవితఁ జెప్ప నేర్పు గలదు నీకు.

అని చెప్పి ప్రోత్సహించెనట. పైన ఆ గురువు "నీకు వీరభద్ర ప్రసాదంబును గలదు కావున వాయు పురాణసారం బగు నీ కథా వృత్తాంతంబంతయు దెలుగున రచింపు" మన్నాఁడట. (కాని రామభద్ర ప్రసాదంబున భాగవత పురాణంబు దెలుంగున రచింపు మనలేదు.)

పోతన్న తన యీ కావ్యపీఠికలో వాల్మీకి వ్యాసులను బాణ, కాలిదాస – మాఘు – శివభద్ర, బోజరాజ – భారవులను అనఁగా సంస్కృత కవులను స్తుతించి – తరువాత నన్నయభట్ట – తిక్కన సోమయాజి – రంగనాథులను, వేములవాడ భీమ కవిని

వర్ణించినాఁడు. కాని వైష్ణవ కవుల పేరెత్తలేదు. అన్నిటికంటెఁ జిత్రము.

క॥ భవుఁ జూడక భవి డాయక
భవు పదములు గొల్చి ఘోరభవభంజనులై
భవదూరులైన పుణ్యుల
భవునర్చన చేసి వరము పడసినవారిన్. గొల్చెదనని

ప్రారంభించి కేవల శివభక్తులను అందులో వీరశైవాచార పరులగు పెద్దలను

"సిరియాలుఁ గరికాలు జేరము నుద్భటు" నని మొదలు పెట్టి సాంఖ్య తొండని సురిచముడ దేవు" అని ముగించి యీ సీసగీతమును—

గీ॥ వెలయ మఱియుఁ గల్గు వీరమాహేశ్వరా
చారపరుల వీరసత్యవ్రతుల
వీర సచ్చరితుల వీరవిక్రములను
బరగ మ్రొక్కి తలఁచి భక్తితోడ.

అను తుది వాక్యములతో ముగించినాఁడు.

ఇట్టివి చూచినఁ బోతన వీరశైవభక్తుఁడని స్పష్టముగాఁ గన్పించుచున్నది. దక్షయాగ ధ్వంస ఘట్టమునఁ బోతన శ్రీనాథుని కాశీఖండ పద్యము ననుకరించెనని వెనుకఁ జెప్పి యుంటిమిగదా! కాశీఖండములో నా సీసముయొక్క ప్రథమ పాదము 'అటమటీఁడైన యీ యక్షభర్త, అని కుబేర నింద్యాత్మ

కముగా నుండఁ బోతన యా పాదమును గొంత మార్చి "యటమటీఁడైన యీ యంబుజాక్షుఁడు" అని విష్ణునిందాత్మకముచేసి నాఁడు. వీనివలనఁ బోతన వీరభద్రవిజయ రచనాకాలమునకుఁ గేవలము వీరశైవ మతాభిమానియై యుండి వీరమాహేశ్వరుఁడైన సోమగురుని యాజ్ఞాపాలనము గావించుచుండెనని తెలియవచ్చుచున్నది. ఆ గ్రంథ రచనా కాలమున కితఁడు కనీసము ౨౦ సంవత్సరముల వయస్సుననైన నున్నవాఁడనక తప్పదు. మఱియు నతఁ డప్పటికిఁ గావ్య నాటకాదులసైతము చదివినవాఁడు గానోపు. అతని కప్పటికే మంచి కవిత్వమలవడినది. అదియు రామభద్రప్రసాదమునఁ గాక వీరభద్రప్రసాదమునన్నైనది. ఇఁకఁ జిదానందయోగి దర్శనాదిక కథ సంపూర్ణముగాఁ గాకెమ్మ కథవంటిదిగాక. మఱేమగును. పోనీ రామాంకితముగాఁ దన పరిపక్వ వయః కాలములో వ్రాసిన భాగవతమునందైనఁ బోతన చిదానంద యోగి పేరెత్తెనా? లేదు.

భాగవతమునఁ బోతన తాను గంగకుఁ (గోదావరికిం) జని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులినశోభిత ప్రదేశంబున మహేశ్వరధ్యానంబు సేయుచుండఁగా. మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిదచెంగటనుండ నొప్పువాఁడు గాన నట్యోనట. అతఁడొక రాజశేఖరుండని మాత్రమే తాను గ్రహించి భాషింప యత్నించుచుండగా నా ధ్యాన నిమగ్న తాస్తిమిత హృదయ దృష్ట పురుషుఁడు తనకుఁ ధ్యానై తాను రామభద్రుండగుటయు భాగవతము గృతిఁ బొందఁగోరి వచ్చు

టయుఁ దెలిపెనట. అందుల కాశ్చర్యపడుచు నేకశిలానగరము నకు వచ్చి యచ్చటి గురు వృద్ధ బుధ బంధుజనుల యనుజ్ఞం బొంది భాగవత రచనకుం గడంగెనట.

ఇంతయైనను బోతన భాగవత గద్యములో.

ఇది శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుఁడ నన్నాఁడేకాని - రాఘవేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుఁడ నని వ్రాసికొనలేదు - మఱియుఁ బోతన తన గ్రంథారంభమున శ్రీకృష్ణ స్తుతి రూపమగు- శ్రీకైవల్యపదంబు జేరుటకునై . . . అను ప్రారంభమును నందాంగనాడింభకుఁ - అను నంత్యమును గల పద్యమును రచించినాఁడు. అనగా నితర కవులవలెఁ గృతి నాయకుఁడగు రామచంద్రమూర్తి స్తుతి రూపమగు పద్యమును రచింపలేదు. షష్ఠ్యంతములు గూడఁ గృష్ణ స్తుతి రూపములే. ఇతర కవులు కృతినాయక విషయములుగనే వానిని వ్రాయు చుండుట ఆచారము.

ఆశ్వాసాద్యంత పద్యములు మాత్రము ప్రత్యేకముగా శ్రీరామ స్తుతి విషయములుగా నున్నవి. ఇట్లనిన రామకృష్ణ స్తుతులలో నేమి భేదమున్నది? అవి రెండును విష్ణ్వవతారములే కదా! అని ప్రశ్నింతురేమో తదభిమానులు వినుఁడు. వాల్మీకి రామాయణము మొదలుకొని యీవలి తెలుఁగు కావ్యముల వఱకు నెందేకాని రామస్తుతులలో విష్ణునామములనఁదగు పదములు పర్యాయములుగాఁ గొను నాచారము గానరాదు. ఇఁకఁ గృష్ణస్తుతులందో మహాభారతము మొదలు నేఁటి

వఱకును బుట్టిన యన్ని కావ్యములందును విష్ణుసామాన్య నామములు పర్యాయములుగా వాడఁబడుట సర్వసాధారణము. పోతన్నయు నిదే మార్గము ననుసరించినాఁడు. అతని ఆశ్వాసాంత పద్యములలో నెచ్చటను విష్ణు సాధారణ నామములు రామ పరములుగాఁ గైకొనఁబడియుండ లేదు. కృష్ణ విషయము ననో యవి సర్వసాధారణములై యున్నవి.

దీనినిబట్టి పోతన్న మొదట శ్రీకృష్ణునకే తన భాగవతము నంకితము చేయఁదలచి ప్రారంభించినట్లును దరువాత నెందుకో యీ యారంభమును మార్చుకొన్నట్లునుగూడఁ దోచుచున్నది. ఇంకొక విశేషమేమనఁగా – భాగవతోపక్రమములో దేవతా స్తుతియుఁ గవిస్తుతియునైన పిదప "భావి కవులం బహూకరించి యుభయ కావ్యదక్షుండనై" అని యొక వచనమును బూర్తి చేసి యాకస్మికముగా నా యుత్తమ పురుష ప్రయోగ పద్ధతిని వదలి – ప్రథమ పురుషలో "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి" అను రాజనిందతో నారంభమై "బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్" అను నాత్మస్తుతితో నంతమగు పద్యమును వ్రాసియున్నాఁడు. తరువాతి పద్యము కేవలము దన యద్వైత భక్తి కనురూపముగా నాతఁడు రచించినది. (చేతులారంగ ఇత్యాది) వీనిలోఁ బరనిందాత్మ స్తుతి విషయమైన పద్యము సందర్భమునకుఁ బొసఁగియుండ లేదు. ఇట్లే వీరభద్ర విజయోపక్రమమునందుఁ గూడ – "తదనుజుండనై (తిప్పన్నను గూర్చి చెప్పిన పిమ్మట) యేను జన్మించి పోతయ నామధేయుం డనై పరగి జనక శిక్షితవిహితాక్షరాభ్యాసుండనై వీరభద్ర

ప్రసాదలబ్ధ కవితాతిశయంబున” అని పోతన్న యుత్తమ పురుషతోఁ బ్రారంభించిన రీతి కనురూపముగనే – “భాగవత ప్రబంధ మతి భాసురతఁ రచియించి” అను నుపక్రమమును “వీరభద్ర విజయంబు రచించెద వేడ్కనాఘదిఁ” అను నుప సంహారమును గల పద్యమొకటి ప్రక్షిప్తము చేయఁబడినది.

దానిని జూచినవారు పోతన వీరభద్రవిజయమునఁ జెప్పఁ కొన్న యితర వాక్యములనుబట్టి తద్రచనాకాలమున కతఁడు పిన్నవాఁడని తెలియుచున్నది గావునను, భాగవతము పరిపక్వ వయస్సులో వ్రాయఁబడి నట్లూహింపఁదగియున్నది గావునను, ప్రక్షిప్తమని గ్రహించినారు. అట్లే యీ “యిమ్మనుజేశ్వ రాధముల” అను పద్యముగూడ బురుష ప్రయోగ వ్యత్యయము చేతను, పోతన స్వభావమునకు వ్యతిరేకముగా నున్నందునను సందర్భశుద్ధి లేనిదగుటచేతను ప్రక్షిప్త మాత్రముగాఁ ద్రోసి వేయఁదగియే యున్నదని నా యభిప్రాయము. దాని తరువాత నున్న

గీ॥ చేతులారంగ శివుని బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నొడువఁడేని

అను పద్యము పోతనయొక్క యద్వైత భక్తిని వెల్లడించుచు నాతని కంతకుమున్నున్న కేవల శైవభక్తి యొక్క పరివర్తనమును సూచించుచున్నది. ఈ పరివర్తనమే కాఁబోలు భాగవతము రామాంకితము చేయఁబడుటకు గారణ మైనది.

శ్రీరాముడు శివ విష్ణ్వాత్మక మూర్తియని కొన్ని పురాణములు చెప్పుచున్నవి. అతని పేరు సైతము నారాయణాష్టాక్షరీ మంత్రములోని 'రా' శివ పంచాక్షరీ మంత్రములోని 'మా' చేరి యేర్పడినదని కొందఱు పూర్వకవులు చమత్కరించి యీ రెండక్షరములు నా యీ మంత్రములనుండి తొలఁగించినచో 'నాయనాయ', "నశివాయ" అను నశుభార్థమునకు గుఱియగుచున్నవని తమ సిద్ధాంతమును జమత్కారముగనే స్థిరపఱుచుచున్నారు.

పోతన్న యీ భావముతోడనే తన భాగవతమును రామాంకితము చేసినాఁడేమో అనుకొనెదను. అట్లైన నితఁడు తిక్కన సోమయాజిని గొంత యనుకరించినాఁ డనవలెను. ఆయన హరిహరనాథుఁడని యద్వైతము చూపగా నంతకంటె యుక్తియుక్తముగాఁ బోతన యీ హరిహరాత్మకమూర్తిని గృతిపతిగాఁ జేసికొన్నాఁడు గాబోలు.

ఇదిగాక భాగవతమును బరీక్షించిన కీ.శే. తేయప్పెరుమాళ్లయ్యగారు తమ భాగవత పీఠికలో బోతన్న శ్రీధరుని యద్వైత వ్యాఖ్యనే యనుసరించినట్లు సోదాహరణముగాఁ బెక్కెడలఁ జూపియున్నారు.

వీరభద్రవిజయములోఁ బోతన్న "జనక శిక్షిత విహితాక్షరాభ్యాసుండనై" అని చెప్పుకొనియున్నందున నాతని ప్రాథమిక విద్యా శిక్షణము శాస్త్రీయముగాఁ దండ్రిచేతనే జరిగిన దనవలయును. ఆ తండ్రి గొప్ప చదువరియని పోతన యీ

గ్రంథమునం దాతని కిచ్చిన విశేషణములు తెలుపఁజాలవు కాని భాగవత పీఠికలోని – "లలితమూర్తి బహుకళానిధి కేసన" అను పోతన వాక్య మాతని విద్యాతిశయమును బ్రకటించుచునే యున్నది. అదియుగాక వీరభద్రవిజయ రచనా కాలమునకుఁ గేసన్న జీవించియే యున్నట్లు – పోతన్న ఆయన చిరాయు రున్నతిని గోరుచుఁ జెప్పిన

చిరాయురున్నతుం జేసి యుమామహేశ్వరులు
చెన్నుఁగఁ గాతురు గాక సత్కృపన్.

అను పద్యభాగమువలన స్పష్టపడుచున్నది. దీనివలనఁ బోతన్నకుఁ గనీస మిరువది సంవత్సరములు నిండునంతవఱకైనఁ దండ్రి జీవించియుండు భాగ్యముగలదని నమ్మవలయును. కేసన్న మంచి యదృష్టశాలి యనినైతము మనకుఁ బోతన్న గ్రంథముల వలనఁ దెలియుచున్నది. కేసన్న 'ఆశ్రిత కల్పవృక్షు' మనియు 'దాస జనప్రసన్నుఁ' డనియు 'కీర్తివిశాలుఁ' డనియు వీరభద్ర విజయమునందును 'దాన మాన నీతి· ధనుడు ఘనుడు' అని భాగవతమునందును జెప్పియున్నాఁడు తత్పుత్రుఁడు.

నిర్ధనుఁ డాశ్రిత కల్పవృక్షముగా గాని దాస దాసీజన సంపన్నుఁడుగాఁ గాని దాన మానసీతిధనుఁడుగా గాఁని యుండఁ జాలదుగదా! పోతన్న తన మాతామహుఁడైన మంచిరాజు – వితరణ ఖని యన్నాఁడు తత్పుత్రియుఁ దన తల్లియునైన లక్కమాంబను – భోగశచి – భాగ్యపుగొరి–సంపదలక్ష్మీ దేఁవి. అని వీరభద్రవిజయమునందును 'కడువదు వితరణ కరుణాలు:

'దాన ధర్మ మతిగౌరవ మంజులతా గభీరతాస్థాని' అని భాగవతమునందును వర్ణించికొన్నందునఁ బోతన దరిద్రుల యింటి బిడ్డఁడు గాఁడు. అతఁడు చదువు సంధ్యలు మాని కొండలపై నావుల గాచుచుండవలసిన దుస్థితియుఁ బట్టియుండ లేదు.

ఇట్లు ప్రథమ వయస్సునందే కాక పోతన్న మధ్యవయస్సు నందు సైతము సంపన్నుఁడై తండ్రివలె జీవించినవాఁడే యనుట కవకాశములున్నవి. అతఁడు ప్రౌఢ వయస్సునఁ గదా సర్వజ్ఞ సింగభూపాలుని యాస్థానకవియై భోగినీదండకము రచించి నది. ఆ కాలము ౧౪౪౦ ప్రాంతమనియు వెనుకఁ దెలిపి యుంటిని. ఇది మంచికాలము. ఈ కాలమున విజయనగర సామ్రాజ్యము శత్రుదుర్నిరీక్ష్యమై యుండినది. దానిని ప్రౌఢ దేవరాయసార్వభౌముఁడుద్దామ పరాక్రమముతోఁ బాలించు చుండెను. అతని నెదిరించు వారా కాలమున నెవ్వరును లేరు. బిదరు రాజ్యము అహమ్మదుషా పుత్రుఁడైన అల్లావుద్దీన్షా పాలనములో నుండెను. అతఁడున్నదానితో సంతసించి అధిక మునకుఁ బోక ౧౪౪౨ వఱకు మడఁగి యున్నట్లు తెలియు చున్నది – ౧౪౪౨ లో మాత్ర మొకసారి విజయనగరముపై దాడివెడలి పరాజితుఁడై యిల్లు చేరుకున్నాఁడు. ౧౪౨౪ మొదలు ౧౪౪౩ వఱకును దెలంగాణములోని తూర్పుభాగము సైతము ప్రౌఢదేవరాయల యధీనమే అయియుండుననను రాచ కొండ దేవరకొండల వెలమరాజులగు లింగమనాయఁడు, సర్వజ్ఞసింగమనాయఁడు ననువారు ప్రౌఢదేవరాయని యను

గ్రహమున నిరపాయముగఁ దమతమ రాజ్యములను బాలించు చున్నందునను, నోరుగల్లు ప్రాంతములు సురక్షితములుగనే యుండెను. కనుకనే యే తద్దేశవాసియగు పోతనయు రాచకొండఁ జేరి తన కవితా పటిమచే సర్వజ్ఞసింగమనాయని మెప్పించి బహూకృతుఁడై యానందించుచుండుననుట కవకాశమున్నది.

క్రీ.శ. ౧౪౪౩ నుండి ౧౪౪౬ వఱకును గూడ నీ దేశము నిరుపద్రవముగనే యుండవచ్చును. ౧౪౪౮ మొదలు ౧౪౪౯లో పల బిదరు కళింగరాజులగు అల్లావుద్దీన్, కపిలేశ్వరులేకమై కొంత విజృంబించి విజయనగర సామ్రాజ్యమున కప్పటి యధిపతియగు మల్లికార్జున రాయలకలజడి కలిగించిరి. అప్పటి నుండి తెలంగాణముగాని దాని యధిపతులగు వెలమరాజులు గాని సుఖముగానున్నట్లు గానరాదు. అయినను ౧౪౫౭ వఱకును అనగా బిదరు అల్లావుద్దీన్ పాలనలో నున్నంతవఱకును దెలంగాణా తురకల బాధకు గుఱియైయుండలేదనవచ్చును. ఈ కాలమునకు పోతన్న రమారమి ౪౭ సంవత్సరముల యీడు గలవాడు. ఇదే భాగవత రచనారంభకాలము గావచ్చును.



# నాల్గవ ప్రకరణము

## భాగవత రచన – అప్పటి స్థితిగతులు.

భాగవతము క్రీ.శ. ౧౪౫౭ ప్రాంతమున నారంభింపఁబడి యుండునని యొక విధముగాం నిర్ణయించితిమిక దా! అప్పటి పోతన్న స్థితిగతు లెట్టివి? అతని హృదయపరిణామ మెట్టిది. అను నీ మొదలుగాఁ గల విశేషము లీ ప్రకరణమునఁ జర్చింప వలసియున్నది. భాగవతమునఁ దన యన్నను గూర్చి 'ఈశ్వర సేవాకాముఁడు తిప్పయ' అని మాత్రమే చెప్పకొనుటయుఁ దత్పూర్వము తన బాల్యదేశమున వ్రాసిన వీరభద్రవిజయ ములో నత్యున్నామ రీతిని "భూదారాహీంద్ర సమాన దక్షుఁడు" "సదాధర్మాకరుఁడు అర్థిమందారుఁడు". అని వర్ణించికొను టయుఁ జూడఁ బోతన యింటి దశ యప్పటికి నిప్పటికి మాఱినదా? ఏమి! అను విచికిత్స పొడముచున్నది.

ఇది యిట్లుండనిచ్చి పోతన తన కృతిని నరాంకితము చేయనొల్లనను పట్టుదలతో వ్రాసినట్లు చెప్పఁబడు 3 పద్యము లలో నొకటి స్వవిషయ స్వవచనముగాను, రెండు ప్రథమ పురుష ప్రయోగ పరవాక్య రూపములుగాను నున్నవి. అందు మొదటిది.

ఉ॥ కాటుక కంటి నీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల యోమదంబ యో
హాటకగర్భు రాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁద్రి శుద్ధిగ నమ్మ భారతీ.

అను పద్యము – ఇది శ్రీనాథు నెత్తిపొడుచుచు నున్న ట్లున్నదనియు ననేకులు దలంచుచున్నారు. అతఁడు పలువురకు గృతు లిచ్చిన వాఁడుగదా! నిజమేకాని యతఁడు కిరాటకులకు గృతి యిచ్చిన కావ్యము సాక్షాత్తుగా హరవిలాసము గాని భోగినీ విలాసము గాదు. భోగినీవిలాస వర్ణనాత్మకమైన క్షుద్ర కృతిని రచింప సాహసించిన పోతన్న అందును గృతినాయకునినే – కథానాయకుఁడుగాఁ గారవించిన పండిత కీర్తనీయుఁడు హరవిలాస కృతికర్తవంటి లోకాతిగ కవిని నిందింపుట కీ వాచాలతఁ జూపునా? ఇందుకు లోకులు చెప్పు సందర్భము నైతము సరిగా నుండలేదు. శ్రీనాథుని యుద్దండ కవితా లీలలకు నతని దని చెప్పబడు

క॥ కమ్మని గ్రంథం బొక్కటి
యిమ్మలనే నృపతికైనఁ గృతి యిచ్చినచోఁ
గొమ్మని యీ యరె వేయా
శ్లిమ్మహిఁ దున్నంగ నేల యిట్టి మహాత్ముల్.

అను పద్యము సర్వథా విరుద్ధమైయున్నది. ఇట్టి పద్య మీావల నే సామాన్యునిచేతనో రచింపఁబడి యుండవలెను. ఇంతకు శ్రీనాథుని వృద్ధాప్యమున బాలుఁడై యుండవలసిన

(పురోక్త కారణములచే) పోతన యతనికి బావయనుటతోc బాటా కథ సర్వము కల్పితమే యనుట కిదియొక సాధనముగా నుపయోగించుచున్నది.

అయితే "అల్ల కర్ణాట కిరాట కీచకుల కమ్మక" అనుటలో బోతన్న యెత్తిపొడిచిన దెవరిని? అను ప్రశ్నమునకు సమాధానము మాత్రము చూడవలసియున్నది. ఎవ్వరిని గాదనియెదను. తానొకవేళc గృతి యీయc దెగించినను దొరకcగల ప్రభువు లిట్టివారేకదా! యని పోతన్న తెలియcజేయుచున్నాcడు. ఈ పద్యములో "ఆకcటికిం గొనిపోయి" అని యున్న వాక్య విశేషమునుబట్టి కడుపుకూcటి కాశింపవలసిన దుస్థితి కతcడు వచ్చెనా? యేమి! అను సందియముగూడc గలుగుచున్నది. అట్టి దశలోcగూడc దానొక నీచకార్యమునకుc బాల్పcడcగూడ దను ధీరతనే యీ పద్యమునc బోతన వ్యక్తీకరించుచున్నాcడు. ఇది యాతని వంశౌదార్యముల కుదాహరణముగా గ్రహింపcదగిన పద్యము.

తక్కిన రెండు పద్యములును బోతన్నవే అనుకొన్న యెడల వానిని గొంత విమర్శింపవలసియున్నది — అందొకటి — భాగవత ప్రారంభముననే కానవచ్చు నీ క్రింది

ఉ॥ ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటు లంబడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకcడు భాగవతంబు జగద్ధితంబుగన్.

అను పద్యము. ఇందలి ప్రథమ పురుష ప్రయోగము నొక వేళ "నానా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్ అను పద్యచ్ఛాయలో నుండఁగూడదా? అని సమాధానము చేసికొందుమేని యిది పోతన్నదే కావచ్చును.

అయినను నిందున్న మనుజేశ్వరాధములను అనుపదము సకల రాజ విషయముగాదు. భోగినీ దండకములోఁ దానా గ్రంథమును రాజాంకితము చేయుచునే యా రాజున కుత్కర్ష సూచించుచుఁ గొందఱితర రాజులను బోతన—

"రాజుల్ బహువ్యాజులే - భోజులే - చంచలచ్చిత్తులే - మత్తులే -
ప్రేతకాయత్తులే - నూతనాసక్తులే - లోభసంయుక్తులే
దోషసంసిక్తులే - రంధ్ర సంపాదులే - వీత మర్యాదులే వారి
సేవింప భోగింప జీవింపఁ బోరామి గావింపగా కాదు: లే -

అని వేశ్యామాతృ ముఖంబున నిందించియు - గథా నాయికా ముఖంబునఁ దన కృతినాయకుని నైశేష్యమును.

"రాయ చౌహత్తమల్లున్ - వధూటీ సరోజాత భల్లున్ మహారాజ వేశ్యాభుజంగున్ - హయానేక పగ్రామ హేమాది నానా మహాదాన చంగున్ సర్వజ్ఞ సింగక్షమాపాలు నైకొంట తప్పే - కకుప్పాలసంకాశుడే అను మాటలతోఁ బ్రకటించినాఁడు మఱియు సింగభూపాలాయత్తమైన చిత్తము పరాయత్తము గాదనుటకు.

ఉల్లసత్ఫుల్ల మందార రాజన్మరందంబు నందంబునన్ గ్రోలు మత్తాళి దుత్తూరముం గోరునే – హేమరాజీవ రాజీ రజో రాజితాకాశ గంగానదీ లోల కల్లోల డోలానటద్రాజ హంసంబు శైవాలగండూపదీ భేక భేకీఘులీ సంకులాసార కాసారముం జేరునే – మండితాఖండలానీల జీమూత నిర్యత్ప యోధారలం ద్రావు సారంగి కుంభాంతరాంభః ప్రపూరంబులం ద్రావునే - మాధవోజ్జాత చూతాంకురస్వాదులీలాలసటత్ త్కోకిలేంద్రంబు ఝిల్లీవర క్రూర భల్లాతకీ శాఖకుంబోవునే – సింగభూపాల బాహాపరీరంభ సంరంభ సంభోగముం గోరుయోషా శిరోరత్నమాశించునే నీచ సంభోగమంబా!—అను నీ మాటలు బ్రహ్లాదుని నోటఁ దాను ముందుముందు పలికింపఁబోవు హరిభక్తి విషయములైన – "మందారమకరంద" ఇత్యాదిగా గల్గు మాటలను దలఁపించునట్లు భోగినిచేఁ బలికించినాఁడు. వీనినిబట్టి పోతనకు భోగినీదండక రచనాకాలమునఁ గృతినాయకుఁడుగా లభించిన యీ సర్వజ్ఞసింగభూపాలుని వంటి రాజు భాగవత రచనాకాలమునకు లభింపలేదో యేమో – అను నూహా స్పైతము పొడముచున్నది. పోనీ తా నదివఱకుఁ గావించిన పని తప్పుగా నెంచుకొనియే దానిపైఁగల హేయభావమును వెల్లడించుచు నీ పద్యమును వ్రాసినాఁడన్నను సమీచీనమే యగుచున్నది. కాని యీ పద్యము శ్రీనాథనిందా సూచకమను కొనవలసిన యవసరమేమియు లేదు.

ఇఁక మూఁడవ పద్యము——

ఉ॥ బాల రసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యకం
గూళల కిచ్చి యప్పడుపు కూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి గహనాంతర సీమలఁ గందమూలికౌ
ద్దాలికులైన నేమి నిజదార సుతోదర పోషణార్థమై.

ఈ పద్యము కేయూర బాహు చరిత్రోపోద్ఘాతములో నున్నది. అది యథమరాజాంకితముగాఁ గృతిచేయుటను గూర్చి తత్కర్తయగు మంచనకవి రచించినట్లందుఁ గలదు. అతఁ డా కృతిని నండూరి గుండ నామాత్యున కంకితముచేయుచు నాతని కుత్కర్షము చెప్పు సందర్భమున నీ పద్యమును రచించినాఁడు కాని యిది పోతన పొలముదున్నుకొనుచుండ శ్రీనాథుఁడు పరిహాసమునకు మీరు హాలికులా? అని యడిగినట్లును దానికిఁ బదులుగా 'కుక్క కాటుకుఁ జెప్పుదెబ్బ' యన్నట్లు పోతన యీ పద్యము చెప్పినట్లును వాఁడుక చేయఁబడినది.

ఒకవేళ నీ పద్యము పోతనదే యనుకొన్నను కూళలకుఁ గృతి యిచ్చుటలోని దోషమును మాత్రమే యిది సూచింపఁ గలిగియున్నదే కాని పోతనయొక్క నరాంకిత కృతి రచనా వైముఖ్యమును సూచించునదిగా నుండలేదు కాకున్న పోతన్న కడపటిదశలో స్వయముగా నేల దున్నుకొని బ్రతుకవలసిన స్థితికి వచ్చినాఁడనుట కిది యొక సూచన పద్యముగా నున్నది. నిజములో నెవ్వఁడో కల్పనా చతురుఁడీ పద్యమును కేయూర బాహు చరిత్రమునుండి లాగుకొనివచ్చి పోతన్నకుఁ దగిలించి

శ్రీనాథుని నీ వ్యాజమున నిందించి తృప్తిచెందియుండునని నేను దలంచుచున్నాను.

శ్రీనాథుఁడు పోతన భాగవత రచనాకాలమువఱకు జీవించియున్నాఁడనుటకును వీలులేదు. ౧౪౨౭ లోపల రాజమహేంద్రవరము రెడ్డిరాజుల రాజ్యమునకు నాల్మడి భానుదేవుని (కళింగరాజు) వలన నొకసారి యుపహతికలిగినది. అందుపై విజయనగరమునుండి ప్రౌఢదేవరాయలు వచ్చి దానిని దప్పించి వేమవీరభద్రరాజులను మరల సింహాసన మెక్కించిపోయెను. తరువాత ౧౪, ౧౫ సంవత్సరములు వారు నిరభ్యంతరముగా రాజ్యము చేయుచుండిరి. కాని ౧౪౪౨-౪౩ ప్రాంతమున ప్రౌఢదేవరాయల తమ్ముఁ డొకఁడు కుటిలోపాయమున నన్నగారి పక్షమువారి ననేకులఁ జంపించియా యన్నను జంపు ప్రయత్నముచేయగా నెట్టకేల కా ఘాత తప్పించుకొని రాయలు మాత్రము జీవింపఁగలిగెను. ఈ కష్ట సమయము దెలిసిన వెంటనే అప్పటి కళింగరాజు కపిలేశ్వరుఁడును బిదరు సుల్తాను అల్లావుద్దీనుడున్ను గలయఁ బలికికొని విజయ నగర సామ్రాజ్యము పైకి దండు వెడలిరి. ఈ సందర్భమును దెలుపుచు శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారు వికృతి సంవత్సరము చైత్రమాస భారతిలోఁ బ్రకటించిన "శ్రీ కృష్ణదేవరాయల కళింగ జైత్రయాత్ర" అను శీర్షికగల వ్యాసములో నిట్లు వ్రాసియున్నారు.

"బహమనీ సుల్తాను కృష్ణా తుంగభద్రల మధ్యప్రదేశ [illegible] సాధింప బ్రయత్నముసేయ గజపతి కపిలేశ్వరుఁడు

రాజమహేంద్రవరరెడ్డి రాజ్యముపైఁ గవిసెను. కాని వారి కోరిక నెరవేరలేదు. లక్కణ దండ నాయకుఁడు గొంత సైన్యముతోఁ గృష్ణా తుంగభద్రల యంతర్వేదిని బ్రవేశించి బహామినీ సైన్యముల నోడించి పాఱఁదోలెను. మల్లప్ప దండ నాయకుఁడు ఘటి కొంత సైన్యముతోఁ గూడ బయలువెడలి పోయి కృష్ణా గోదావరుల నడిమి తీరాంధ్రదేశమును జొచ్చి కపిలేశ్వరుని బరాభూతుని గావించి రాజమహేంద్రవరరెడ్డి రాజ్యమును రక్షించెను."

వారి యీ వ్రాతనుబట్టి రాజమహేంద్రవర రాజ్యము ౧౪౪౨-౪౩ ప్రాంతపు గజపతి దాడికిఁ దట్టుకొని నిలిచినట్లే యర్థమగును కాని, యీ దాడిలో రెడ్డిరాజులు కపిలేశ్వరునిచేఁ జంపఁబడిరేమో అని నేను దలంచుచున్నాను. శ్రీ వేంకట రమణయ్యగారు ప్రౌఢదేవరాయని మరణానంతరము పై రెడ్డి రాజ్యము ౧౪౫౦ ప్రాంతమున నాశముచేయఁబడియుండునని యూహించుచున్నారు. నా యూహకును వారి యూహకును రమారమి ౭ సం॥ల భేదమున్నది. వీరభద్రారెడ్డి మరణము వఱకును శ్రీనాథకవి జీవించియుండవలెను. ఏలయన—"కాశికా విశ్వేశుగలసె వీరారెడ్డి రత్నాంబరంబు లేరాజొసంగు" అని తన యంత్యకాలములో శ్రీనాథుఁడు దుఃఖించుట అట్లైననే కదా సంభవము. నా అభిప్రాయము ప్రకారము శ్రీనాథకవి క్రీ.శ. ౧౩౭౦ ప్రాంతమున జన్మించి ౧౪౫౦ ప్రాంతమున మరణించియుండునని – వీరభద్రభూపాలుని పిమ్మట కనీసము ౬, ౭, సంవత్సరములైన నాతఁడు జీవించియుండువనుకొన్నఁ

దన్మరణము ౧౪౫౦ నాఁటిది. లేదా యింకను గొంత ముందు నాఁటిదైన గావచ్చును. అతడు కనీసము ౮౦ సంవత్సరములు జీవించియుండవచ్చును. కాశీఖండము క్రీ.శ. ౧౪౩౦ ప్రాంతమున వ్రాసియుండును. అది యీతని వార్ధకారంభకాలము అనఁగా ౬౦ సంవత్సరముల దాఁటిన వయఃకాలము. కావుననే "ప్రాయమింతకు మిగులఁ గై వ్రాలకుండ" కాశికాఖండము రచింతునన్నాఁడు.

పోతన భాగవత రచనా కాలమునాఁటి కతని పూర్వాశ్రయమగు సర్వజ్ఞసింగభూపాలుని స్థితి యెట్టిదో విచారించి చూతము. ఈతని జ్ఞాతిసోదరుఁడగు లింగమనాయఁడు ౧౪౨౦లో నల్పవయస్కుఁడై యుండియు బంధుబలమునఁ గొండవీఁటి కోమటి వేమభూపాలుని జంపెనని చరిత్రము చెప్పుచున్నది. కావున నా లింగమనాయఁడుగాని యాతని జ్ఞాతిసోదరుడగు నీ సర్వజ్ఞసింగమనాయఁడుగానియు ౧౪౨౦ నాఁటికి రమారమి ౨౦ సం॥ల యీడుగలవారుగానైన నుందురు. పోతన భాగవత రచనాకాలము ౧౪౫౨ ప్రాంతమగునేని వారప్పటికి ౫౨ సంవత్సరముల యీడు దాఁటిన్నవారు మాత్రమే కాఁదగుదురు. సర్వజ్ఞసింగభూపాలుఁడు పోతన్నకు నవయస్కుఁడై యుండునని యూహించినను బోతన్న సైతము ౫౨ సం॥ల యీడు గల వాడుగ నేయుండి భాగవత రచన కుపక్రమించి యుండవలెను. అట్లయినను బోతన్న శ్రీనాథునకంటె ౩౦ సంవత్సరములైన చిన్నవాఁడై యుండవలెను గదా! ఇది యిట్లుండి భోగినీ దండక కృతిపతి ౧౪౫౨ వఱకు జీవించియుండుననుట కంత

యభ్యంతరముండదు. ఈ కాలములో బిదరు సుల్తానగు అల్లా యుద్దీనీ మరణింపఁగా నా రాజ్యమునకు హుమాయూన్ షా రాజై గజపతితోఁ దమకుఁ బూర్వమున్న సంధిని సైతము గమనింపక దేవరకొండ హిందూ రాజ్యము (లింగమనాయని రాజ్యము) పై దాడి వెడలెనట. అట్టి తరుణమున నా హిందూ రాజులు కపిలేశ్వరుని సాహాయ్యము వేఁడిరనియు నతఁ డందుల కంగీకరించి హిందూమత సంరక్షణమునకు సంసిద్ధుఁడయ్యె ననియు బురానే అస్సిరి, అను తురష్కచరిత్ర గ్రంథము తెలుపుచున్నది. కావున దేవరకొండ రాజ్యముతో పాటు రాచకొండ రాజ్యముగూడ నీ హుమాయూన్ షా క్రౌర్యముఁ బై ప్రకారము ౧౪౫౮ ప్రాంతమునఁ దప్పించుకొని యుండఁ వచ్చును. సర్వజ్ఞ సింగమనాయని తరువాత నాతని తమ్ముఁడు భోగినీదండకములో

"వసంతావనీ నాథ సంసేవితాంచత్పదాంభోజా"

అని కృతినాయకుని తమ్ముఁడుగా వర్ణింపఁబడిన వసంతరావు గూడఁ గొంతకాలము రాజ్యముచేసినట్లు

చ॥ వడవడి చక్కగాదొలక దినంబును బుక్కిటఁ జేదు మానఁ జే
ర్పడ విన వీనులేదు పెను పండువునందును గాలిఁ గ్రోలు నీ
బడుగును బొందనేల యని పాపి ఫణిం జనుఁ జెంచి కాదె యూ
పుడమి వహించె వేడ్క నృపపుంగవు రావువసంత రాయనికా.

అను పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది - కావున నీ ౧౪౫౭ నాటికి సర్వజ్ఞసింగమనాయుఁడుగాని యాతని తమ్ముఁడైన యీ వసంతరాయఁడుగాని జీవించి రాచకొండ నేలుచుండవచ్చును. అయినను మనకీ విచారణ అంత అవసరమైనదిగాదు.

పోతన భాగవతమును గూర్చి కొంత యిదివఱకే ఆ యా సందర్భముల లోఁ జర్చించియున్నాము - ఇతఁ డీ పురాణమును శ్రీధరపండితుని యద్వైత వ్యాఖ్యా ననుసరించి తెలిగించెనని భాగవత పీఠికలలో నొకదానియందు శ్రీ తంతెయ ప్పెరుమాళ్ళయ్యగారు సోదాహరణముగాఁ నిర్ణయించి చూపి యున్నారు. నా యభిప్రాయములో మూలగ్రంథము చాల వఱకు విశిష్టాద్వైత పక్షీయమైనదే. అట్లైననూ బోతన దానిని ద్రోసిరాజనుట యతని యద్వైత మతాభిమానమును బ్రక టించుచున్నది. అద్వైత మనఁగా శివ విష్ణ్వభేదమును బాటిం చుటగాదు కాని - కేవల విశిష్టాద్వైతులు జీవాత్మ పరమాత్మ లయభేదమును గూడ నంగీకరింపరు. పోతన యీ విషయమున నద్వైతి యనక తప్పదు. మొట్టమొదట పోతన్నది వంశక్రమా గతమైన శివవిశిష్టాద్వైత మతము. కాని వయస్సు ముదురు నప్పటి కాతఁ డద్వైత భక్తి నవలంబించినాఁడు. అంతేకాని మతము మార్చుకొన్నట్లు లేదు - హరిహరనాథునకుఁ గృతి యిచ్చి మహాభారతమును రచించిన తిక్కనయం దీతనికి గౌరవ మధికమనుటకు గొంత యవకాశమున్నది. వీరభద్ర విజయములో

"ఉన్నత గుణాధుర్యు నన్నపార్యు" అని నన్నయ్యను సేవిత కవిరాజి శ్రీ సోమయాజి.—అని తిక్కనను సామాన్య రీతిసే వర్ణించియు భాగవతమునందు

"ఆంధ్ర కవితా గౌరవజన మనోహరి"

"నన్నయ సూరింగ్గొ వారంబుసేసి" అని నన్నయ్యను

"హరిహర చరణారవింద వందనాభిలాషిఁ దిక్క మనీషిం భూషించి" అని తిక్కనను వర్ణించుటలో గొంత భేదము గానవచ్చును.

భాగవతములోఁ బోతనయొక్కయు నితర కవుల యొక్కయుఁ బద్యములు గొంతవఱకు లెక్కించి చూడ వచ్చును.

## పోతన పద్య సంఖ్య

ప్రథమ స్కంధము—౫౧౮ ద్వితీయ స్కంధము ౨౮౭ తృతీయ స్కంధము ౧౦౫౮ చతుర్థ స్కంధము ౯౭౬ సప్తమ స్కంధము ౪౮౧ అష్టమ స్కంధము ౭౪౩ నవమ స్కంధము ౭౩౫ దశమ స్కంధ పూర్వభాగము ౧౭౮౯ తదుత్తర భాగములో ౨౩౬. ఈ మొత్తము ౬౮౩౦ పద్యములు. పోతన్న రచించినవిగాఁ దత్తగ్రంథములను బట్టియు దశమ స్కంధోత్తర భాగమునఁ 'కాటుక నెఱుకుంగ' అను పద్యము నుండి వెలిగందల నారయ వ్రాసినట్లున్న వ్రాఁతకనుబట్టియు నొక విధముగాఁ దలంపవచ్చును.

## వెలిగందల నారయ పద్య సంఖ్య

'కాటుక నెఱయంగ' అను పద్యము మొదలు దశమ స్కంధోత్తర భాగము ౧౧౦౫ ఏకాదశ స్కంధము ౧౨౬ ద్వాదశ స్కంధము ౫౩ మొత్తము ౧౨౮౪ - పద్యములు వెలిగందల నారయవి.

## గంగ యార్యుని పద్య సంఖ్య

పంచస్కంధ ప్రథమాశ్వాసము ౧౮౨ తద్ద్వితీయాశ్వాసము ౧౬౭ మొత్తము ౩౪౯ పద్యములు. బొప్పనామాత్య పుత్రుఁడగు గంగ నార్యునివి.

షష్ఠ స్కంధము - ౫౨౯ పద్యములు సింగయవి.

ఇట్లు భాగవతములోని ౧౨ స్కంధములు జేరి ౮౯౯౨ పద్యములు కలవు - కొందఱు తెలుగు భాగవతములో 30 వేల గ్రంథ సంఖ్య గలదందురు. కాని దాని తాత్పర్యమేమో తెలియవచ్చుట లేదు.

ఇందుపై శ్రీ శేషాద్రిరమణ కవుల యభిప్రాయము. "దీనినిం కూర్చి పలువురు పలు విధములు వాకొనుచున్నారు. ఏకారణమువలననైననేమి పోతనామాత్యుఁడు రచించిన పంద్రెండు స్కంధముల భాగవతములోఁ గొంతభాగము జీర్ణించినది, ద్వితీయ స్కంధములో ౯౫ పద్యముల కావలి భాగము తృతీయ స్కంధములో స్వల్పభాగములు చతుర్థ స్కంధములో గొంతభాగము పంచమషష్ఠస్కంధములు దశమ

స్కంధము ఉత్తరభాగములోఁ గొంతభాగము ఏకాదశ ద్వాదశ స్కంధములు పరుల రచనములతోఁ గూడియున్నవి. ఆయా భ్రష్ట భాగములన్నియుఁ బరులు పూర్తిచేసిరనియు నందలి కవిత పూర్తిగాఁ బరులదే యనియు మేము విశ్వసింపఁ జాలము" అని. వీరి యభిప్రాయానుసారము ద్వితీయ స్కంధములో వెనుపటి ౧౭౬ పద్యములుపోగా మిగత(౨౮౮-౧౭౬=) ౧౧౨ పద్యములు గూఢ నితరులచేయిగలిసినవేయని - తక్కిన చోటుల జరిగినవి సంస్కరణ మాత్రములే యని వారి యభిప్రాయము.

భాగవతమున కిట్టి దుర్గతి యేల పట్టెనో యెవ్వరును నిర్ణయింపఁ జాలకున్నారు. పోతన్నకుఁ గేసన యను కుమారుఁడున్నాఁడు. అతనికిఁ బ్రౌఢసరస్వతి యను బిరుదము గలదని తత్పుత్రులు దాక్షాయణీ పరిణయమునందు వ్రాసిన - "అప్పలమ్మయును వీరాంబయుఁ బ్రౌఢసరస్వతికిని గన్న ప్రజ్ఞవారి" అను పద్యభాగమువలనను, ఈతని యల్లుఁడగు నజ్జనరపు పేరలింగము ఒడయనంబి విలాస పీఠికలోఁ దన భార్యను గూర్చి వ్రాసిన

ఉ॥ బమ్మెర వంశమందునను బ్రౌఢ సరస్వతి పద్మగాంచి తా
నెమ్మి దలిర్పఁ గేసన కవీశ్వరు లప్పమ సాముసాధ్వి యం
దిమ్మహిఁ గూర్మిఁ గన్న సుత యెల్లమ యాగును బేరయాఖ్యుఁడౌ
సమ్మతిఁ గంటి వీరనరసమ్మను గంగన మంత్రియుగ్మమున్.

అను పద్యమువలనను సువ్యక్తమగుచున్నది.

ఇంతటి మహాపండితుఁడు కుమారుఁడై యుండఁ బోతన భాగవతమున కింతటి దుర్గతి యేల పట్టెనో వివేకింప సాధ్యముగాకున్నది—కూచిమంచి తిమ్మకవి చెప్పిన కారణము భోగినీదండక కృతిపతియగు సర్వజ్ఞసింగభూపాలుని దుండగమే యని. ఇది నమ్ముట యెట్లు? పోతన భాగవతరచన క్రీ. ౧౪౬౦ ప్రాంతమని నా యభిప్రాయము. పూర్వ పీఠికాకారు లిట్లే నిర్ణయించిరని శ్రీ శేషాద్రిరమణ కవులు దమ పీఠికారంభములో వ్రాసియుండిరిగదా! నా పరిశీలన ఫలితముగూడఁ దదనురూపముగనే యున్నది. శ్రీ కందుకూరు వీరేశలింగము పంతులుగారు క్రీ.శ. ౧౪౭౦ కి ఆవలివాఁడని పోతనను గూర్చి వ్రాయుటలోఁ గూడ నంత వ్యత్యాసముకాదని నా యభిప్రాయము. ఈ కాలమునందలి నానా పరిస్థితులే భాగవత శైథిల్యమునకుఁ గారణమేమో. ఆ విషయమును గొంత వెనుకనే చర్చించియుంటిని.

## పోతన యనుకరణములు

ద్విపద॥ ౧. క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించుహంస
గోరునే పడియల నీరు ద్రావంగ

౨. చూత ఫలంబులు సుంబించు చిలుక
భ్రాతిఁ బూరుగు మాని పండ్లు గన్గొనునె

౩. రాకామల జ్యోత్స్నఁ ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీకటిఁ ద్రావ

౪. విరిదమ్మి వాసన విహరించు తేఁటి
పరిగొని సుడియునే బబ్బిలి విరుల

ఎఱుఁగునే యల గిగ్గజేంద్రంపుఁ గోదను
యొఱ పంది చను సీక నెఱుఁగవుగాక

బసవ పురాణము శ్రీ ఆశ్వాసము ౨౩౫ పేజీ.

౪. సీ॥ మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు

౧. నిర్మల మందాకి నీవీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు

౨. లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు

౩. పూర్ణేందు చంద్రి కాస్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు

గీ॥ నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్తమేరీతి నితరులఁ జేర నేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల

# ఎఱ్ఱాప్రగ్గడ నృసింహ పురాణము

ఉ॥ ఊషిర బీజముల్ భసితయోజ్య ఘృతంబులు షండకన్యకా
న్వేషణముల్ పయోధిగత వృష్టితతుల్ మృగ తృష్ణికాంబుగం
దూషలు దుర్గకానన కశోరిత చంద్రిక లెందు మాక స
ద్భావలం విష్ణు మంగళ కథా విముఖాత్ముల దుష్టజన్మముల్

నృసిం. పు - ౫ ఆశ్వా ౨.

శా॥ అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూక స
ద్గ్రంథాభ్యాసనముల్ నపుంసకవధూ కాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడ స
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్త వ్యర్థ సంసారముల్.

ఉ॥ అక్కట బ్రహ్మబంధువ! దురాత్మక! నావగవాని కీర్తనం
బెక్కడనుండి యీ శిశువు కెప్పగిదిం జదివించి తిజ్జగం
బెక్కటి యేలు నామహిమ యేమియుఁ గైకొన కివ్విధంబునం
దక్కువ పాటొనర్చితి వృథా పరిజల్పన కల్పనంబులన్

వ॥ అనిన నసురేశ్వరునకు నుపాధ్యాయుం డిట్లనియె

చ॥ కిని యసురదైత్యనాథ యొక కీడును నాదెస లేదు చెప్ప నీ
తనయుఁడు వక్రశీలుఁడు నితాంతనయోక్తుల యేను సెప్పఁగా
వినక నిజేచ్ఛమైఁ గడఁగి వేమఱు నిట్లని యుగ్గడించు నీ
యనువున నిట్టికోరడపుటాలరి శిష్యుల కేలచేపడున్

వ॥ అనవుడు నతండు కుమారుంగనుంగొని

క॥ ఓవత్స నీవు చెప్పిన । యీ విధమేఁ జెప్పననియె నిదె యొజ్జలు నీ
కేవాఁడు గఱపె నేర్పడ । గా వెఱవక చెప్పు మట్టిఖలు దండింతున్

ఎఱ్ఱన నృ. పు. ౪ ఆశ్వా ౯-౧౩.

చ॥ పటుతరనీతి శాస్త్రచయపారగుఁ జేసెదనంచు బాలు నీ
వటు గొనిపోయి వానికి నవర్ణ్యములైన విరోధి శాస్త్రముల్
కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండవటంచు నమ్మితిం
గటకట బ్రాహ్మణాకృతిని గాక యథార్థపు బ్రాహ్మణుండవే.

వ॥ అనిన రాజునకుఁ బురోహితుం డిట్లనియె.

ఉ॥ తప్పులు లేవు మావలన దానవనాథ విరోధి శాస్త్రముల్
చెప్పము క్రూరులై పరులు సెప్పరు మీ చరణంబులాన సు
మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు నైజమనీష యెవ్వరుం
జెప్పెడిపాటిగాదు ప్రతిచింతఁ దలంపుము నేర్పుకైవడిన్.

వ॥ అనిన... దైత్యవల్లభుండు కొడుకునవలోకించి యిట్లనియె.

క॥ ఒజ్జలు సెప్పని యీమతి। మజ్జాతుఁడవైన నీకు మఱి యెవ్వరిచే
నుజ్జాత మయ్యెబాలక। తజ్జనులం జేరకొనుచుతగ నా క్రోలన్.

భాగ. సప్త. ౧౭౩-౧౭౫-౧౭౯.

ఈ క్రింది అనుకరణములు చూడుడు ఇవి. అన్వయ వ్యతిరేక మాత్రభేదములై యున్నవి.

సీ॥ వాసుదేవుని పాదసరసిరుహంబుల భక్తి
తగదను తండ్రియుఁ దండ్రిగాఁడు. ఎఱ్ఱన
తండ్రి హరిఁ జేరు మనియెడు తండ్రి తండ్రి — పోతన
"వేదచోదితమైన విష్ణు ధర్మమునకుఁ
గోపించు గురుఁడును గురుఁడుగాఁడు. ఎఱ్ఱన.
"కంబునీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు." పోతన
"పరయోగ మతమగు వైష్ణవజ్ఞానంబు
వదలిన చదువును జదువుగాదు." ఎఱ్ఱన.
"చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు" పోతన.
"మాధవస్తోత్ర ఘన సుధా మధుర రుచులఁ
జిలుక కుండెడు జిహ్వయుఁ జిహ్వగాదు" ఎఱ్ఱన
"శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ" పోతన.

N.B. :-పోతన యీ పద్య భావములు మూల భాగవతానుసరణములుగావు. కనుక ఎఱ్ఱాప్రగ్గడ నృసింహ పురాణ వాక్యానుసరణములే యని స్పష్టముగాఁ జెప్పవచ్చును.

పోతన భాగవత మాంధ్రులకుఁ బరమప్రియమైన గ్రంథము అందును నీ క్రింది కొన్ని పద్యములును అష్టమ స్కంధములోని గజేంద్రమోక్షమును దశమ స్కంధములోని రుక్మిణీ కల్యాణమును ప్రత్యేకముగా నాంధ్రులకుఁ బ్రాణ తుల్యములైనవి.

మ॥ లలిత స్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై.

ప్రథ. స్కం. ౨౨.

చ॥ సనుఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిపో
వను మహాప్రీతిని హా కుమార యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు చక్కం జేసె మున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణి తపోధన్యాగ్రణిన్ ధీమణిన్.

ప్రథ. స్కం. ౫౪.

శా॥ శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా శృంగార రత్నాకరా
లోకద్రోహి నరేంద్ర వంశదహనా లోకేశ్వరా దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా నిర్వాణసంధాయకా
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ.

మ॥ తనుహృద్భాషల సఖ్యముఁ శ్రవణముఁ దాసత్వముఁ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయుఁ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్ముఁ హరిఁ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతుఁ సత్యంబు దైత్యోత్తమా.

సప్త స్కం. ౧౬౭

మ॥ కలఁడంభోధి గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలన్
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల యీ యా యెడన్.

సప్త. స్కం. ౨౭౪.

క॥ ఇందుఁగలఁ డందు లేఁడని । సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన । నందందే కలఁడు దానవాగ్రణి వింటే

సప్త స్కం. ౨౭౫.

క॥ మ్రింగెడువాఁడు విభుండని । మ్రింగెడునది గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ । మంగళసూత్రంబు నెంత మదినమ్మినదో.

అష్ట. స్కం. ౨౪౧.

క॥ చలచలనై పిదపిదనై । కలలంబై కరుఁడుగట్టి కళవాళముతోఁ
దల యేర్పడి గర్భంబై । నెలమసలం జీరచిక్కె నెలఁతకు నధిపా!

అష్ట. స్కం. ౪౯౩

క॥ హరిహరి సిరియురమునఁ గల
హరిహరిహయముఖ్యకొలుచు దనుజా నడుగంజనియెం

బరహితరత మతిఁగుంతులగు
దొరలకు నడుగుటయును నొడలితొడవగుఁ బుడమిన్.

అష్ట. స్కం. ౫౩౬

క॥ వెడవెడ నడకలు నడచుచు
నెడనెడ నడుగిడఁగ నడుగులిడఁబడఁగా
బుడి బుడి నొడువులు నొడువుచు
జిడిముడిఁ దడఁ బడఁగ వడుగు సేరెన్ రాజా.

అష్ట. స్కం. ౫౪౧

మ॥ ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కీలాది ది
క్పతి గర్వాపహ యప్రవర్తి గతలోభస్ఫూర్తి నానామఖ
వ్రత దాన ప్రవణానువర్తి సుమనోరామా మనోభేదకో
ద్ధత చంద్రాతప కీర్తి సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి దాన్.

ఉ॥ స్వస్తి జగత్త్రయీ భువన శాసన కర్తకు హాసమాత్రవి
ధ్వస్త నిలింపభర్తకు నుదార పద వ్యవహర్తకున్ మునీం
ద్రప్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు నిర్జరీ గళ
న్యస్త సువర్ణ సూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్.

అష్ట. స్కం. ౫౪౫

ఆ॥ ఒంటివాఁడఁ నాకు నొకటి రెండడుగుల
మేర యిమ్ము సొమ్ము మేరయొల్లఁ
గోర్కెదీర బ్రహ్మ కూకటి ముట్టెద.
దాన కుతుక సాంద్ర దానవేంద్ర.

అష్ట. స్కం. ౫౬౬

వట్టుకుఁ బోతన రచనలో భాగవతమునందలి అష్టమ స్కంధము తక్కిన భాగములన్నింటిలో నత్యంత మనోహరముగా వెలయుచున్నదని నా యభిప్రాయము. దశమ స్కంధ మట్టిదని కొందఱి భావము, నాకు మాత్రమది ద్వితీయ స్థాన మీయఁ దగినదని తోఁచెడిని "భిన్నరుచిర్హి లోకః" అని కదా వృద్ధ వ్యవహారము. అష్టమ స్కంధములో గజేంద్ర మోక్ష మనన్యాదృశము. కనుకనే యిది యాంధ్రులకు జిరకాలముగాఁ బ్రాతః పఠనీయమైనది.

క॥ కలఁడందురు దీనులయెడఁ । గలఁడందురు పరమయోగి గణములపాలం
గలఁడందు రన్నిదిశలను । గలఁడు కలండనెడువాఁడు గలఁడో లేఁడో

శా॥ లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువుం డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!

అను నీ మొదలగు పద్యములందలి యార్తభక్తి జగన్మోహనముగదా! నవమ స్కంధములో రామకథా భాగమునఁ బోతన తన యసాధారణ కవితా శక్తిని బ్రదర్శించెనని కొందఱనుచున్నారు. కాని నా యభిప్రాయ మాతఁ డా శక్తి సామర్థ్యములను బరశురామావతార కథలో నెక్కుడుగాఁ జూపెననియే.

ఇందలి కొన్ని పద్యములను నేను నా భార్గవ చరిత్రములో ననుసరించితిని చూఁడుఁడు.

ఉ॥ బాలుఁడు వెఱ్ఱి బ్రాహ్మణుఁడు బ్రాహ్మణు లైవడి నుంట మాని భూ
పాలుర తోడ భూరిబల భవ్యుల తోడ భయంబు దక్కి క
య్యాలకు వచ్చినాఁడు మన యంకికి బాపనులేగు లెండు లెం
డేల సహింప భూమిరు నేయుఁడు వ్రేయుఁడు కూల్చుఁ డిమ్మహిన్.
భాగ. నవ. ౪౪౯.

ఉ॥ పాత్రుఁడ దానమిమ్మన కపాతుఁడవై పగఁబూని మాపయిన్
క్షాత్రముఁ జూప వచ్చితి వశంకతి నింకిట నెంగఁ బోయెది
ద్ధాత్రి నినున్ మదుగ్ర శర ధారల వ్రేల్మిడిఁ జీల్చి క్షత్రియా
పుత్రక! నీదు మాంసములు ప్రోవులు పెట్టెద జంబుకాళికిన్.
నా భార్గ. చ. ఆశ్వా. ౨౪౬.

మ॥ ఒకయేనూరు కరంబులన్ ధనువులత్యుల్లాసియై తాల్చి వే
ఱొక యేనూటగుణధ్వనుల్ నిగుడ శాతోగ్రాస్త్రముల్ గూర్చి వి
ప్రకుఠారంబును నిన్నుఁ గూల్తు ననుచున్ భర్జించి పుంఖాను పుం
ఖ కఠోరంబుగ నేసి యార్చె రయ రేఖాధాముని న్రామునిన్.
భాగ. నవ. ౪౫౪.

మ॥ ఒక యేనూఱు కరంబు లుగ్రశరసంయోగోద్ధతిం గ్రాల వే
ఱొక యేనూఱు శరాసనోజ్వలములై యొప్పారుచుండంగ ర
క్తకటాహంబులు వోని కన్నుల భృగూత్తంసున్ విలోకించి యో
గి కిలాగర్దముఁ డమ్మహీ విభుఁడు దగ్రస్ఫూర్తిఁ దానిట్లనున్.
నా భార్గవ. చ ఆ. ౨౪౫.

దశమ స్కంధమునుండి కై కొని రుక్మిణీకల్యాణము నాంధ్రులత్యంత భక్తి తాత్పర్యములతోఁ బఠింతురు – ఇట్లు పండిత పామర జనసాధారణముగా భాగవత మాంధ్ర దేశమున సకల జనపూజితమై యలరారుచున్నది. భాగవతమునం

దేవేని కొన్ని లక్షణవిరుద్ధము లున్నవనుట నిజమేకాని. యవి యంత పాటింపఁ దగినవి కావు.

ఈ నా గ్రంథవిశేషముచే నిత్య విష్ణులోక నివాసులైన పోతానామాత్య కవిశేఖరుఁడు నాతని యిష్టదైవములైన శివవిష్ణుమూర్తులును నాకు శాశ్వత సుఖసంతోషదాయకులై కరుణింతురు గాక.——

ఇతి. శ్రీః.

గీ॥ చేతులారంగ శివుని బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరి కీర్తి నొడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
కలుగ నేటికిఁ దల్లుల కడుపు చేటు

అను శ్రీ పోతానామాత్యు నిర్ణయ మాంధ్రులకు నిత్య స్మరణీయము.

మ॥ శివపూజావిరత వ్రతోన్నతము నీచేదోయి దానిత్యకే
శవనామస్మరణాను కీర్తన విధావ్రాంతంబు నీ నోరు స
త్యవచస్సార దయా సమగ్రము భవచ్చారిత్ర మో పోతరాట్
కవి నిన్నన్న దె తల్లి [illegible]మదేవో గర్భంబునా నిబ్బువిక్.

